JAGATI Rs. 2-00 February 1990

35th Year of Publication




ఫిబ్రవరి - 1990

## సాహితీ సుధ

ఇల గందంబులు మూలముల్ పడిసెనో యేల్లింకెనో కొండలన్
ఫలముల్ నారలు వృక్షశాఖలయెడం బాడయ్యెనో చూడ
వల దుఃఖాః ప్తమితార్థ గర్వపవన వ్యావర్తి తభ్రూల స
త్ఖల భూపాస్యము లర్థి జూచెదరు భ్రాంతస్వాంతులై యాచకుల్

—భర్తృహరి

*

ఆరకూటములోవ నపరంజి ఖుడినట్లు - చెఱువులో బన్నీరు చిలికినట్లు
చౌటినేలను మంచిపస్యం బిడినయట్లు - వెలిమిడిలో నెయ్యి వేల్చినట్లు
షండున కందమౌ సతిని గూర్చినయట్లు - పేడలో గస్తూరి పెట్టినట్లు
పాడింటిలోన దీపంబు నిల్పినయట్లు - వార్ధిలో గురిసిన వాన యట్లు
తొడరి సుజనులు ధరణిలో దుర్జనులకు - జేయు ప్రకృతి వ్యర్థమైను చెఱు గదయ్య
భూషుత విలాస పీఠికాపుర వివాస - కుముద హితకోటి పంకాశ కుక్కుటేశ

—కుక్కుటేశ్వర శతకం

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్: 76697 - చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు. 100-00. శాశ్వత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: ఆంధ్ర ముఖ్యమంత్రి చెన్నారెడ్డి

# నిమ్మతొనలు

మొన్న నవంబరులో జరిగిన ఎన్నికలలో అతి తక్కువ మంది గల పోలింగ్ స్టేషనేదో చెప్పగలవా, గోపీ?' - అని ప్రశ్నించారు టీచరు.

'లక్షద్వీప్' అన్నాడు గోపి.

'ప్రాంతం కాదు, పోలింగ్ స్టేషన్ - చాలా ఎత్తయిన చోట?'

'హిమాయాలల్లోనా?'

'అవును, సముద్ర మట్టానికి 15,000 అడుగుల ఎత్తున - కాంగ్రా నియోజక వర్గంలో! ఆ గ్రామం పేరు ఖిర్. ముప్ఫయి ముప్ఫయ్యయిదు మైళ్లు కంచర గాడిదలమీద ప్రయాణం చేయాలి. అక్కడి జనాభా 52. వారు సైతం ఈ ఎన్నికలలో పాల్గొన గల అవకాశం కల్పించడమే ప్రజాస్వామ్య పరిరక్షణ' - అన్నారు టీచరు.

వుమెన్స్ హాస్టలులోని అమ్మాయిలు మాట్లాడుకుంటున్నారు.

'లోక్‌సభ ఎన్నికలలో ఏలూరు నుంచి కృష్ణ, రాజమండ్రి నుంచి జమున, బొంబయి నుంచి సునీల్‌దత్ తప్ప యింకెవరూ సినిమావారు పాల్గొన్నట్టు లేదు' - అంది కామేశ్వరి.

అవునవునని అందరూ జమునని, కృష్ణని మెచ్చుకుంటూ వుండగా, ఉషా అక్కడికొచ్చి 'యు ఆర్ రాంగ్' అంది.

'ఇంకెవరైనా ఉన్నారా?' అని కామేశ్వరి ప్రశ్న.

'సౌరాష్ట్ర నుంచి స్నేహలత. గుజరాత్ ఫిలిమ్ ఫీల్డ్‌లో ఆమెకు తిరుగులేదు. ఆమె, తన నామినేషన్ పత్రాలు దాఖలు చేశాక, పెద్దలు కొందరు స్వయంగా వచ్చి, విరమించుకోమని కోరడంతో వారి మాట కాదనలేక, 'విత్‌డ్రా' చేసుకుంది' – అంది ఉషాబాల – క్లాస్‌మేట్స్‌కంటె తనకి ఎంత ఎక్కువ తెలుసో, వారి వంక గర్వంగా చూస్తూ!

ప్రఖ్యాత కన్నడ సాహిత్యకార్ శివరామ్ కరంత్ ఎన్నికలకు నిలబడగా, ఆయన నిలబడకూడదని ఎవరో కేసు పెట్టారట? - అని అడిగాడు లెక్చరర్ సూర్యం, తన కొలీగ్ శేఖరాన్ని!

'వ్రాసిన పుస్తకాన్ని బట్టి రచయితకు అపవాదులు అంటగట్టే దేశం మనది. జీనియసూ, మాడ్‌మానూ సామాన్యులకి భిన్నంగా ఉంటారని సైకాలజీలో చదివి మెచ్చుకుంటాం. అటువంటి యితివృత్తంతో ఒక నవల రాశారు కరంత్. అందుకని, ఆయ

నకు మతి స్థిమితం లేదనీ, అందువల్ల ఎన్నికలలో పోటీ వేయకూడదనీ కేసు పెట్టాడు ఒక ప్రబుద్ధుడు ....'

'ఏమయింది ?'

'జడ్జీగారు నవ్వుకు, ఆ ప్రబుద్ధుని చీవాట్లు పెట్టి, కేసు కొట్టేశారు' - అన్నాడు శేఖర్.

ఆంధ్రాకు, పశ్చిమ బెంగాల్‌కు లోక్ సభ స్థానాలు 42 చొప్పున. తమిళ నాడుకి 39. కేరళకు 20. హిమాచల ప్రదేశ్ 4. అత్యధిక స్థానాలు గలది ఉత్తరప్రదేశ్ - 85. ఒక్కొక్క స్థానం మాత్రమే గలవి తొమ్మిది ఉన్నాయి. ఆరు నేను చెబుతాను - మిగతా మూడు మీరు చెప్పాలి' - అన్నాడు క్విజ్ మాస్టరు.

ఆ మాత్రం 'గెస్' చేయలేక పోతామా అని ధీమాగా కూచున్నాయి మూడు టీమ్సూ.

క్విజ్ మాస్టరు ప్రారంభించాడు : 'అండమాన్ - నికోబార్ ; పాండుచ్చేరి ; లక్షద్వీప్ ; నగర్ హవేలి ; దామన్ - డియు ; మిజోరామ్ - ఆరు అయాయి కదా - మిగతా మూడు ?'

'గోవా' అన్నది మొదటి ఛాన్స్ పొందిన హైదరాబాదు టీమ్.

'రాంగ్, గోవాకి రెండు స్థానాలు వున్నాయి. నెక్స్టట్ - విజయవాడ టీమ్ ?'

'చండీఘర్'

'కరెక్ట్. మిగతా రెండు ?'

'అరుణాచల ప్రదేశ్'

'నో.... అరుణాచలప్రదేశ్‌కి రెండు స్థానాలు వున్నాయి. మరొక్క ఛాన్స్ యిస్తున్నాను.'

'పాస్'

'ఫైనల్ ఛాన్స్ వైజాగ్ టీమ్‌కి ?'

'సిక్కిమ్'

'ఒకె - ఇంకొక్కటి మనవాళ్లు పూజిస్తారు, పాలుపోస్తారు....

'నాగాలాండ్' అని మూడు టీమ్సూ ఏకకంఠంతో అన్నాయి.

—క్షీరసాగరమ్

# పాఠకుల తీర్పు

చందూర్ దంపతులకు స్సులు .... నయగర జలపాతం - అక్టోబరు పదహారు.... అమ్మాయి జ్యోతి, అల్లుడు కొవ్వలి సత్యనారాయణ (సిటీ బాంక్ వైస్ ప్రెసిడెంట్) యిక్కడ వున్నారు గనక వారి ఆహ్వానం పురస్కరించుకుని కెనడా, అమెరికా పర్యటన చేస్తున్నాం. నా జన్మదినం ఆనంది ఆశ్వయుజ పౌర్ణమి ఆదివారం 4 - 10 - 1914. అక్టోబరు నాలుగున నా ప్లాటినమ్ జుబిలీ జన్మదినోత్సవం భక్తి శ్రద్ధలతో ఇక్కడ జరిపించారు. ఇవ్వాళ ఈ మహాగంగ నయగర జలపాతం చూసి జన్మ తరించిన అనుభూతి పొందాము - నేను, అన్నపూర్ణ మీ ఉభయులకు తేజస్సును, సౌభాగ్యాన్ని ఆకాంక్షిస్తూ,

—కాటూరి జగన్‌మోహన్
టొరంటో

చందూర్‌గారికి : నమస్తే. 'కన్నీరు కార్చే వృక్షరాజ' ముఖచిత్రం ఎంతో కదిలించింది. పత్రికలోని విషయాలు ఉన్నత ప్రమాణంలో ఉన్నాయి. పాత కేళ్లనాటి 'దేవత' చిత్రాన్ని మరలా గుర్తు చేసి, చూసిన అనుభూతి కలిగించారు. మీ 'డైరీ' ద్వారా ఎన్నో ఆసక్తికరమైన విషయాలు తెలుసుకున్నాను.

—చిల్లర భవానీదేవి
హైదరాబాదు-681

చందూర్‌గారికి హృదయ పూర్వక నమస్కారములతో. ఒక నెల 'జ గ తి' పోస్టువారి అలక్ష్యం వల్ల అందలేదంటే, ఏదో పోగొట్టుకున్నట్లుగా ఉంటుంది. అందలేదని తెలియపరచగానే మీరు మరల పంపుతున్నారు - చాలా సంతోషము. కేసరిగారి 'ముచ్చట్లు' ఎంత బాగుంటున్నవో చెప్పలేను.

—అమ్మాజీ సర్కార్
అల్ హస్సా

శ్రీయుత చందూర్‌గారికి : నమస్కారములు. నా అభ్యర్థన మన్నించి, అవుటాఫ్ ప్రింటయిన 'ప్రతిగురువారం' రచన 'జ గ తి'లో ప్రచురించి, నన్ను ఆనందపరిచి నందుకు మీకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. మీ అభిమానాన్ని ఎల్లప్పుడు జ్ఞాపకం పెట్టుకుంటాను.... ఈ నాడు వస్తున్న కొన్ని కథల పత్రికలూ, వాటిలోని రచనలూ చాలా భయంకరంగా ఉంటున్నాయి. బీభత్స రస ప్రధానంగా, వికృతంగా వరదలా వస్తున్న తెలుగు పత్రికా ప్రపంచంలో మీ 'జ గ తి' పత్రిక సంస్కార ప్రబోధకం, విజ్ఞాన దాయకం.

—సిహెచ్ మల్లిబాబు
దుమ్ముగూడెం

# వెన్నెల కెరటాలు

## చిన్న పత్రికలు

రాష్ట్ర ప్రభుత్వం ఐదువేల సర్క్యులేషన్ వున్న పత్రికలకే ప్రభుత్వ గుర్తింపు లభిస్తుందని ప్రకటించడం - చిన్న పత్రికలను మరింత దెబ్బ తీయడమే అవుతుంది. రాష్ట్రంలో రాజకీయాలకు ప్రాధాన్యతనిస్తూ నడిచే చిన్న పత్రికలలో ఏ ఒకటో, రెండో తప్ప రాష్ట్రంలోని వందలాది పత్రికల సర్క్యులేషన్ ఐదువేలకు లోపే వుంటుంది. కేవలం వ్యాపారమే ధ్యేయంగా, కోట్లకు కోట్లు పెట్టుబడి క్రుమ్మరించి పారిశ్రామిక వేత్తలు పోటాపోటీలుగా నడుపుతున్న దినపత్రికల మధ్య లేగ దూడలు ఈ చిన్న పత్రికలు. పారిశ్రామికవేత్తల ఇష్టా ఇష్టాలనే దిన పత్రికలు ప్రతిఫలిస్తుంటాయి. వారికి, పాలకులతో పేచీవస్తే, ప్రభుత్వ వ్యతిరేక విధానం ; వారికి పెద్ద కాంట్రాక్టు లిస్తే అనుకూల విధానం.... ప్రజాభిప్రాయం వ్యక్తం చేయడంలో, స్థానికంగా, చిన్న పత్రికలు పాటించే వైవిధ్యం, పెద్ద పత్రికలలో కన్పడదు. వారివి వ్యాపారాభిప్రాయాలే తప్ప, ప్రజాభిప్రాయాలు కావు.

—ఆర్ రామచంద్రరావు
'లోకం పోకడ'లో

ఒక కథను తీసుకుంటే రచయిత అనేక పాత్రలను సృష్టి చేయటం జరుగుతుంది. షేక్స్పియరు 360 పాత్రలను తన సారస్వతంలో సృష్టించాడట. అలాగే వ్యాసుడు భారతంలో 3 వేల పాత్రలను సృష్టించాడంటారు. ప్రతి పాత్రను ఆ రచయిత ఆదర్శంగా తీసుకోమని చెప్పటం సంభవించదు. ఆ వ్యక్తి వుద్దేశ్యం అది కాదు, కనుక మరియాను, ఓల్గాను, జెన్యాను రచయిత్రి సమర్థిస్తున్నదా అని ప్రశ్నించటం అనుచితం. ఒక స్త్రీ ఎక్కువ మంది పురుషులతో ప్రేమ కలాపాలు, సాంగత్యం పెట్టుకుంటే పుట్టబోయే పిల్ల తండ్రి ఎవరో నిర్ధారణ కాదని, అందువల్ల పనికి ర్గాదని ఒక వాదన వచ్చింది ఇటీవల. ఇది ఇన్ని తరాలుగా పురుషులను పట్టి పీడించిన ప్రశ్న. ఇప్పుడు ఒక స్త్రీకి కూడా ఈ ప్రశ్న స్త్రీల పరంగా వుదయించటం ఆశ్చర్యంగా ఉంది కదూ !

—వ్యాసభాగం
'స్త్రీ స్వేచ్ఛ'

# పాతికేళ్ళ నాటి పిక్చర్

## జెమినీ వారి
## 'ఆడబ్రతుకు'

పట్నంలో కర్ఫ్యూ విధించిన కారణంగా, ధూర్మార్గుల మోసంలో యిరుక్కున్న వనిత, ఆత్మ రక్షణకు ఒకరింట్లో ప్రవేశిస్తుంది. పెళ్లికి పూర్వం తనపై మక్కువ చూపిన గోపాలరావుది ఆ యిల్లు. అతనింకా పెళ్లి చేసుకోలేదు - బ్రహ్మచారి. ఆ రాత్రి అక్కడ తప్పనిసరిగా వుండిపోవలసి వస్తుంది - అంతేగాక, ఆమె చెవుల జూకాల్లో ఒకటి ఆ యింట్లో జారిపడుతుంది. వారిద్దరూ ఎటువంటి తప్పూ చేయరు.... భర్తతో ఫలానాచోట తలదాచుకోవలసి వచ్చిందని వెంటనే చెబితే ఏ గొడవా ఉండేది కాదు. కాని, భయపడి చెప్పదు. ఈ సీతను (దేవిక) కథానాయకుడు (యన్.టి రామారావు) ఆమె నాటకాలలో వేషాలు వేస్తున్న రోజులలో, వంచకుల చేత అపహరింపబడగా, ధైర్యసాహసాలతో రక్షించాడు. ఆ తర్వాత మనసులు కలుస్తాయి ; మమతలు పెరుగుతాయి ; పరస్పరం యిష్టపడి పెళ్లిచేసుకుంటారు .... ప్రదర్శన చూసివస్తున్న ఈ దంపతులు కారులో కూచుంటారు. అది జన సమ్మర్దం గల ప్రదేశం. కారు టైరులోని గాలి, రౌడీలు అంతకు ముందే తీసేశారు. వారి దుడుసు మాటలు సీతకు గాభరా పుట్టిస్తాయి .... పావుగంట వ్యవధిలో కర్ఫ్యూ విధింపబడిన కారణంగా సంభవించిన ఒక సన్నివేశం చుట్టూ అల్లిన ఫార్ములా కథ ఇది. ఆ కేంద్రకం చుట్టూ పాత్రలు తిరుగుతాయే తప్ప వాటిలో జీవం గాని, వాస్తవికతగాని కనిపించదు. కథా సంవిధానంలో పటుత్వం లేకపోయినా నాటకీయత ఉంది. కరుణ రసానికి ప్రాధాన్యమిచ్చారు, 'హనీ' అనే కుక్క అనేక అద్భుతాలువేస్తుంది. చెవులకింపుగా వినిపించే సుమధుర గానం. ఇక, నటీనటులు తమ పాత్రలను ఎంతో చక్కగా పోషించారు. కాంతారావు, ముక్కామల 'భేష్' అనిపించారు. దేవిక, స్త్రీ జనావళిని ఆ కట్టుకు, కన్నీళ్లు తెప్పిస్తుంది. నాయకుని పాత్రకు నిండుతనమిచ్చాడు యన్ టి రామారావు. ఈ చిత్రానికి నిర్మాత : యస్సెస్ వాసన్ ; దర్శకులు : వేదాంతం రాఘవయ్య.

—యన్నార్ చందూర్ సమీక్ష.
'జగతి' - డిశంబరు 1965

మన బ్రతుక్కి ఒక ఉద్దేశం, ఒక లక్ష్యం కల్పించబడితే గాని అది జీవిత మనిపించుకోదు. —రాఫెల్

ఈ లోకంలో ఎవరు సుఖజీవనులు ? భయాలు వీడి, ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకో గల ధీరులు. —పాటర్సన్.

## మానవ ప్రగతి

## మొన్నటి భూకంపం

అమెరికా చరిత్రలో అతి తీవ్రమైన భూకంపాలలో ఒకటిగా పేర్కొనదగిన భూకంపం ఇటీవల (1989 అక్టోబరు 17న) ఉత్తర కాలిఫోర్నియాలో సంభవించింది. అయితే ఈ భూకంపానికి శాన్ ఫ్రాన్సిస్కో ప్రాంతంలో కూలిపోయిన రహదారి నిర్మాణాలు, భవనాలు, వంతెనలన్నీ కూడ పాత కట్టడాలే కావడం గమనార్హం. గత 15, 20 ఏళ్లలో కాలిఫోర్నియా రాష్ట్రం నిర్మాణాల విషయంలో కఠినమైన నిబంధనలను అమలులోకి తెచ్చింది. కాగా ఇప్పుడు కూలిపోయిన కట్టడాలన్నీ కూడా ఈ నిబంధనలు అమలులోకి రాక పూర్వం నిర్మితమైనవే. అక్టోబరు 17 నాటి భూకంపం 'రిక్చర్ స్కేలు' పై 6.9 పాయింట్లుగా నమోదైంది. ఈ భూకంపం పెక్కు రహదారులకు, వంతెనలకు, భవంతులకు నష్టం కలిగించడంతో పాటు అనేక ప్రాంతాలలో అగ్ని జ్వాలలను కూడా రగిల్చి, నష్టం కలిగించింది. అయితే శాన్‌ఫ్రాన్సిస్కోలో నూతనంగా నిర్మితమైన పెద్ద పెద్ద భవనాలు, అతిపెద్ద ఆకాశ హర్మ్యాలకు ఈ భూకంపంలో అంతగా నష్టం వాటిల్లలేదు. నగరం మధ్యలోని 90 భవనాలను భూకంపం 3 రోజుల తర్వాత తనిఖీ చేయగా వాటిలో 3 మాత్రమే సురక్షితంగా లేవని, 8 మాత్రమే బాగా దెబ్బ తిన్నాయని వెల్లడైంది. 'శాన్‌ఫ్రాన్సిస్కో భవంతులు మేము ఆశించిన దానికంటె కూడా ఎక్కువగా ఈ భూకంపాన్ని తట్టుకున్నాయి' అని చీఫ్ బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్ చెప్పారు. పలువురు మోటారిస్టుల మృతికి దారి తీస్తూ కూలిపోయిన ఓక్‌లాండ్ - శాన్‌ఫ్రాన్సిస్కో రెండంతస్తుల రహదారి, మరీనా ప్రాంతంలో పడిపోయిన అపార్ట్‌మెంట్ గృహాలు 1950 ప్రాంతంలో గాని, లేదా అంతకు ముందు గాని నిర్మితమైనవని ఇంజనీర్లు వివరించారు. శాంటా బార్బారాలో 1932 లో భూకంపం సంభవించడంతో కాలిఫోర్నియా ప్రజల ఆ తర్వాత కాలంలో భూకంపాలకు తట్టుకునే విధంగా గృహాలను నిర్మించుకోవడం ప్రారంభించారు. దక్షిణకాలిఫోర్నియాలోని శాన్‌ఫెర్నాండో వ్యాలీలో

## జెమినీ వారి 'ఆడబ్రతుకు'

పట్నంలో కర్ఫ్యూ విధించిన కారణంగా, ధుర్మార్గుల మోసంలో యిరుక్కున్న వనిత, ఆత్మ రక్షణకు ఒకరింట్లో ప్రవేశిస్తుంది. పెళ్లికి పూర్వం తనపై మక్కువ చూపిన గోపాల రావుది ఆ యిల్లు. అతనింకా పెళ్లి చేసుకోలేదు - బ్రహ్మచారి. ఆ రాత్రి అక్కడ తప్పనిసరిగా వుండిపోవలసి వస్తుంది - అంతేగాక, ఆమె చెవుల జూకాల్లో ఒకటి ఆ యింట్లో జారిపడు తుంది. వారిద్దరూ ఎటువంటి తప్పూ చేయరు.... భర్తతో ఫలానాచోట తలదాచుకోవలసి వచ్చిందని వెంటనే చెబితే ఏ గొడవా ఉండేది కాదు. కాని, భయపడి చెప్పదు. ఈ సీతను (దేవిక) కథానాయకుడు (యన్‌టి రామారావు) ఆమె నాటకాలలో వేషాలు వేస్తున్న రోజులలో, వంచకుల చేత అపహరింప బడగా, ధైర్యసాహసాలతో రక్షిం చాడు. ఆ తర్వాత మనసులు కలు స్తాయి; మమతలు పెరుగుతాయి; పరస్పరం యిష్టపడి పెళ్లిచేసుకుంటారు ... ప్రదర్శన చూసివస్తున్న ఈ దంపతులు కారులో కూచుంటారు. అది జన సమ్మర్దం గల ప్రదేశం. కారు టైరులోని గాలి, రౌడీలు అంతకు ముందే తీసేశారు. వారి దుడుసు మాటలు సీతకు గాభరా పుట్టిస్తాయి .... పావుగంట వ్యవధిలో కర్ఫ్యూ విధింపబడిన కారణంగా సంభవించిన ఒక సన్నివేశం చుట్టూ అల్లిన ఫార్ములా కథ ఇది. ఆ కేంద్రకం చుట్టూ పాత్రలు తిరుగుతాయే తప్ప వాటిలో జీవం గాని, వాస్తవికతగాని కనిపిం చదు. కథా సంవిధానంలో పటుత్వం లేకపోయినా నాటకీయత ఉంది. కరుణ రసానికి ప్రాధాన్యమిచ్చారు, 'హనీ' అనే కుక్క అనేక అద్భుతాలు వేస్తుంది. చెవులకింపుగా వినిపించే సుమధుర గానం. ఇక, నటీనటులు తమ పాత్ర లను ఎంతో చక్కగా పోషించారు. కాంతారావు, ముక్కామల 'భేష్' అని పించారు. దేవిక, స్త్రీ జనావళిని ఆ కట్టుకు, కన్నీళ్లు తెప్పిస్తుంది. నాయ కుని పాత్రకు నిండుతనమిచ్చాడు యన్ టి రామారావు. ఈ చిత్రానికి నిర్మాత : యస్సెస్ వాసన్ ; దర్శ కులు : వేదాంతం రాఘవయ్య.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - డిశంబరు 1965

మన బ్రతుక్కి ఒక ఉద్దేశం, ఒక లక్ష్యం కల్పించబడితే గాని అది జీవిత మనిపించుకోదు. —రాఛెల్

ఈ లోకంలో ఎవరు సుఖజీవ నులు ? భయాలు వీడి, ఆత్మగౌర వాన్ని నిలబెట్టుకో గల ధీరులు.

—పాటర్సన్

# మానవ ప్రగతి

## మొన్నటి భూకంపం

అమెరికా చరిత్రలో అతి తీవ్రమైన భూకంపాలలో ఒకటిగా పేర్కొనదగిన భూకంపం ఇటీవల (1989 అక్టోబరు 17న) ఉత్తర కాలిఫోర్నియాలో సంభవించింది. అయితే ఈ భూకంపానికి శాన్ ఫ్రాన్సిస్కో ప్రాంతంలో కూలిపోయిన రహదారి నిర్మాణాలు, భవనాలు, వంతెనలన్నీ కూడ పాత కట్టడాలే కావడం గమనార్హం. గత 15, 20 ఏళ్లలో కాలిఫోర్నియా రాష్ట్రం నిర్మాణాల విషయంలో కఠినమైన నిబంధనలను అమలులోకి తెచ్చింది. కాగా ఇప్పుడు కూలిపోయిన కట్టడాలన్నీ కూడా ఈ నిబంధనలు అమలులోకి రాక పూర్వం నిర్మితమైనవే. అక్టోబరు 17 నాటి భూకంపం 'రిక్టర్ స్కేలు' పై 6.9 పాయింట్లుగా నమోదైంది. ఈ భూకంపం పెక్కు రహదారులకు, వంతెనలకు, భవంతులకు నష్టం కలిగించడంతో పాటు అనేక ప్రాంతాలలో అగ్ని జ్వాలలను కూడా రగిల్చి, నష్టం కలిగించింది. అయితే శాన్‌ఫ్రాన్సిస్కోలో నూతనంగా నిర్మితమైన పెద్ద పెద్ద భవనాలు, అతిపెద్ద ఆకాశ హర్మ్యాలకు ఈ భూకంపంలో అంతగా నష్టం వాటిల్లలేదు. నగరం మధ్యలోని 90 భవనాలను భూకంపం 3 రోజుల తర్వాత తనిఖీ చేయగా వాటిలో 3 మాత్రమే సురక్షితంగా లేవని, 8 మాత్రమే బాగా దెబ్బ తిన్నాయని వెల్లడైంది. 'శాన్‌ఫ్రాన్సిస్కో భవంతులు మేము ఆశించిన దానికంటె కూడా ఎక్కువగా ఈ భూకంపాన్ని తట్టుకున్నాయి' అని చీఫ్ బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్ చెప్పారు. పలువురు మోటారిస్టుల మృతికి దారి తీస్తూ కూలిపోయిన ఓక్‌లాండ్ - శాన్‌ఫ్రాన్సిస్కో రెండంతస్థుల రహదారి, మరీనా ప్రాంతంలో పడిపోయిన అపార్ట్‌మెంట్ గృహాలు 1950 ప్రాంతంలో గాని, లేదా అంతకు ముందు గాని నిర్మితమైనవని ఇంజనీర్లు వివరించారు. శాంటా బార్బారాలో 1932 లో భూకంపం సంభవించడంతో కాలిఫోర్నియా ప్రజల ఆ తర్వాత కాలంలో భూకంపాలకు తట్టుకునే విధంగా గృహాలను నిర్మించకోవడం ప్రారంభించారు. దక్షిణకాలిఫోర్నియాలోని శాన్‌ఫెర్నాండో వ్యాలీలో

1971లో ఏర్పడిన భూకంపం అనంతరం శాన్‌ఫ్రాన్సిస్కోలో భవన నిర్మాణ నిబంధనలు మరింత కఠినతరమయ్యాయి. భూకంపం సమయంలో ఏర్పడే 'లేటరల్ ఫోర్స్' అనే భూమి కదలికలను తట్టుకునే విధంగా వుండి తీరవలసిందే. సాధారణంగా భూకంపం సంభవించినప్పుడు మామూలుగా నిర్మితమైన భవనాలలో దిగువభాగం కంటె ఎగువ భాగంలోని అంతస్థులకు ఎక్కువ నష్టం జరుగుతుంది. కాగా భూకంపాన్ని తట్టుకునే విధంగా నిర్మించే నూతన భవనాలలో భవంతి 'ఫ్రేము' భూకంపం సమయంలో ఏర్పడే భూమి కదలికలకు అనుగుణంగా కదిలి తద్వారా భవనం కూలిపోకుండా కాపాడుతుంది. మరొక తరహా నూతన కట్టడాలలో 'సీస్మిక్ బేరింగ్స్'ని వినియోగిస్తారు. వీటిని ఉక్కు, రబ్బరు పొరలతో తయారు చేస్తారు. ఇవి 'షాక్ అబ్జార్బర్స్'లా పనిచేసి భూమితో ఏర్పడే కదలికలు భవనంలోకి సోకకుండా నిరోధిస్తాయి.

## సిక్ బిల్డింగ్స్

'బిల్డింగు'లలో (భవనాలలో) 'సిక్ బిల్డింగు'లు వుంటాయని మీరెప్పుడైనా విన్నారా? అంతేకాదు; 'సిక్ బిల్డింగ్ సిండ్రోమ్' అనేది వున్న వైనం మీకు తెలుసా? ఆధునిక నిర్మాణ రీతులలో గాలి చొరబడని విధంగా కట్టే భవనాలు, అలాగే సింథటిక్ పదార్థాలతో నిర్మిత మయ్యే భవనాలు ఒక్కోసారి 'సిక్ బిల్డింగు'లుగా మారే అవకాశం వుంటుంది. ఇట్టి భవంతులలో నివసించే వారికి కళ్ళ మంటలు, వంటిపై దద్దుర్లు, మగత, ముక్కు దిబ్బడ, తలనొప్పి మొదలైన రుగ్మతలు ఏర్పడతాయి. కాగా, ఈ 'సిక్ బిల్డింగ్ సిండ్రోమ్'కి విరుగుడు అయా భవంతుల లోపల మొక్కలు (ఇన్‌డోర్ ప్లాంట్స్) పెంచడమేనని ఇటీవల పరిశోధనలలో వెల్లడైంది. కొత్తగా కట్టిన, లేదా పునర్నిర్మించిన భవనాలలో సుమారు 30 శాతం భవనాల లోపల వాయు కాలుష్యం ఏర్పడివున్నట్లు ఇటీవల ఒక ఆరోగ్య సంస్థ పేర్కొంది. భవన నిర్మాణంలో వినియోగించిన సింథటిక్ పదార్థాల నుంచి వెలువడే విషపూరిత వాయువులను ఆ 'ఇన్‌డోర్ ప్లాంట్స్' ఆకులు గ్రహిస్తాయని పరిశోధకులు పేర్కొన్నారు.

## పునఃప్రారంభం

ఈ సంవత్సరం మూడువేలకు పైగా వివిధ మతాలకు చెందిన ప్రార్థనా మందిరాలు - రష్యన్ ఆర్థడాక్స్ చర్చిలు, మసీదులు, బౌద్ధ ఆరామాలు, యూదుల సినగాగ్‌లు, బాప్టిస్టుల సెవెన్త్ డే అడ్వెంటిస్టుల ప్రార్థనా మందిరాలు, పోలిష్ రోమన్ కాథలిక్ చర్చిలు, లూథరన్, ఆర్మీనియన్, జార్జియన్ చర్చిలు తమ పనిని పునః ప్రారంభించడమో, కొత్తగా నిర్మితమవడమో జరిగిందని సోవియట్ మంత్రి మండలికి చెందిన మత వ్యవహారాల ఉపసంఘం తెలిపిందని సోవియట్ వార్తా సంస్థ పేర్కొంది.

# కొత్త పుస్తకాలు

## 'నీలాపనిందలు'

'యూకలిప్టస్ చెట్టుమీద అభాంకాలువేస్తే, పాపం, ఎవరితో మొర పెట్టుకుంటుంది చెప్పండి?' అంటూ, 'విస్పష్టమైన వివరణ, హేతుబద్ధమైన ఆలోచనా స్రవంతి, రసవంతమైన శైలి, చక్కని నుడికారం' - అని మెచ్చుకున్నారు యన్.టి. రామారావు. 'మూడు ముక్కల్లో గ్రంథస్థ విషయాన్ని అర్థవంతంగా చెప్పారు' అని సి. నారాయణరెడ్డి అభినందించగా, 'నీలగిరి, నిజంగా విషవృక్షమా? లేక కల్పతరువా? ఈ నీలగిరి మానవాళికి, ఒకశాపమా? లేక వరమా?' అనే ప్రశ్నలకు సమాధానం చెబుతూ, అపోహలను తొలిగించారు - అన్నారు భద్రిరాజు కృష్ణమూర్తి, 'రామాయణం అశోకవృక్షాన్ని ప్రసిద్ధం గావించింది. గౌతమబుద్ధుడు రావిచెట్టును జ

ఈ వాదోప వాదాలు 'యూకలిప్టస్' ఉరఫ్ 'నీలగిరి' ఉరఫ్ 'జామాయిల్' చెట్టుకు అపూర్వ ప్రచారం తెస్తున్నాయి. గొప్ప నిపుణులని చెప్పదగిన కొద్దిమందిలో ఈ రచయిత ఒకరు. ఆయన తెలుగువారు కావడం, నీలగిరి చెట్లపై తెలుగులో అత్యంత ప్రామాణిక గ్రంథం వెలువడటానికి కారణమైంది' - అని చెప్పారు పొత్తూరి వెంకటేశ్వరరావు. 'కృష్ణమూర్తిగారు అటవీశాఖలో ఒక ఉన్నతోద్యోగియే గాక, ఆంధ్రప్రదేశ్ అకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో కార్యనిర్వాహక వర్గ సభ్యులు. వాదోపవాదాలను సమగ్రంగా పరిశీలించి, శాస్త్రీయంగా విశ్లేషించిన కరదీపిక ఇది' - అన్నారు 'సైన్సెస్ అకాడమీ' అధ్యక్షులు నిడమర్తి కొండలరావు. వీరుగాక, గాలి ముద్దుకృష్ణమనాయుడు, ఛీఫ్ కన్సర్వేటర్ కెవియస్ బాబు, అధికార భాషా సంఘాధ్యక్షులు నండూరి రామకృష్ణమాచార్య, అంతర్జాతీయ అటవీ శాస్త్ర సలహాదారు ఎయల్ రావు ఈ గ్రంథాన్ని ప్రశంసించారు. మూడు ప్రధాన విభాగాలు, నలభైమూడు పట్టికలు, తమ వాదాన్ని బలపరిచే ముప్పయి ఒక్క చిత్రపటాలుగల ఈ రచన, 184 ప్రామాణిక పుస్తకాలు ఆధారాలతోను, 'వెర్సటైల్ యూకలిప్టస్' అని - చికెసి రాజన్ వ్రాసిన ఆంగ్లగ్రంథం (1987) యిచ్చిన ప్రోత్సాహము స్ఫూర్తితోను, యింతటి మన్ననలతోన వెలువడింది. 1988 డిసెంబరు 23న తేదీన, ఆంధ్రప్రదేశ అకాడమీ ఆఫ్

సైన్సెసవారి రజతోత్సవ సందర్భంగా, ఆంధ్రా గవర్నరు కుముద్ బెన్‌జోషీ, ఈ పుస్తకాన్ని లాంఛన ప్రాయంగా విడుదల చేశారు. పూర్తి పుస్తకాన్ని 1989 మే 9వ తేదీన అటవీశాఖమంత్రి సురేందర్‌రెడ్డి రిలీజ్ చేశారు. ('నీలాపనిందల - నీలగిరి-నిర్దోషి' - The Much Maligned Eucalyptus - రచయిత; డా॥ ఎవిఆర్‌జి కృష్ణమూర్తి ఐఎఫ్ఎస్ - ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ అకాడమీ ఆఫ్ సైన్సెస్, ఉస్మానియా విశ్వ విద్యాలయ ఆవరణ, హైదరాబాదు - 500 007.... వెల : రు 60-00)

నీలగిరి మీదపడ్డ నిందలు ఎటువంటివి? నీలగిరి చేసిన అపకారం ఏమిటి? నీలగిరి చెట్లమీద ఒక వర్గం ఎందుకింత కక్షకట్టింది? నీలగిరి వేసిన చోట నిజంగానే యితర పంటలు పండవా? భూగర్భానున్న నీటిని అది పీల్చేస్తుందా? విషవాయువు వెదజల్లే లక్షణాలు వున్నాయా దానికి? మేకలూ పశువులూ ఆ ఆకులు తిననంతమాత్రాన, ఆ చెట్లమీద పక్షులువాలవా? గూళ్లు కట్టుకోవా? ఇటువంటి అనేక ప్రశ్నలకు సహేతుకమూ విజ్ఞానయుతమూ అగు సమాధానం, సాక్ష్యాధారాలతో చెబుతుంది ఈ పుస్తకం.

ఆస్ట్రేలియాలో సుమారు ఆరు వందల జాతుల యూకలిప్టస్ ఉన్నది. 1770 ప్రాంతాన టిప్పుసుల్తాన్ నంది హిల్స్‌లో 16 జాతుల నీలగిరి మొక్కలు నాటించాడు - వాటిలో కొన్ని జాతులు యిప్పటికీ వున్నాయి. 1856 లో నీలగిరి కొండలలో నాటించిన దానిని 'గ్లోబ్యులస్ జాతి' అంటారు. ప్రపంచంలో కల్లా పెద్దదైన నీలగిరి చెట్టు టాస్‌మానియాలో ఉంది. దాని ఎత్తు 314 అడుగులు. కాండం 201 అడుగులు. ఆంధ్రప్రదేశ్‌లో అతిపురాతనమైన నీలగిరి చెట్టు చిత్తూరు జిల్లా 'హార్సిలీహిల్స్' లో ఉంది - 1843 నాటిదని అంటారు. 150 అడుగుల ఎత్తు; 15 అడుగుల కైవారం. పళని కొండలలో ఉన్నది యింతకంటె పెద్దది.

నీలగిరి వల్ల ఉపయోగా లేమిటి? ఇది త్వరగా పెరిగే చెట్టు, నీరు తక్కువ వున్నా, ఎక్కువ వున్నా యిబ్బంది లేదు. అడవులకి వాటిల్లగల అగ్నిప్రమాదాలకు రక్షణ కవచం: పశువులు మేయవు గనక కంచె మాదిరి పనికొస్తుంది. కలప, వంటచెరుకు, ఫలసాయం - మూడూ లభ్యమవుతాయి. గాలి ఉధృతానికి 'విండ్‌బ్రేకర్' లా తోడ్పడుతుంది. భూగర్భ జలనిధులు పెరుగుతాయి. భూసారానికి రక్షణ నిస్తూ, ఒండ్రు మట్టి కొట్టుకు పోనివ్వదు. బెరడు నుంచి ఆకాలిక్ యాసిడ్ వస్తుంది. నీలగిరి తైలం అందరికీ తెల్సిందే. నీలగిరి చెట్లమీద తేనెతుట్టె లుంటాయి. ఇరవై నాలుగు రకాల ఉపయోగాలు వున్నాయి.

31 ఆఫ్రికన్ దేశాలలో నీలగిరి తోటలు పెంచుతున్నారు. 1914 కి పూర్వం ఆఫ్రికా ఖండంలో ఒక్క ఇథియోపియా తప్ప, మిగతావన్నీ పాశ్చాత్య దేశాల వలసలవటం వల్ల, నీలగిరి చెట్లను అక్కడ విస్తృతంగా

నాటారు; పెంచారు. 1936లో ఇథియోపియా ఇటాలియనుల వశమయాక, 4000 హెక్టారులలో మాత్రమే ఉన్న నీలగిరి తోటలను 13,500 హెక్టారుల ప్రమాణానికి వృద్ధి చేశారు. దక్షిణాఫ్రికాలో 3, 47, 464 హెక్టారుల నేలలో ఈ తోటలు వున్నాయి. ఆ తర్వాత మొరాకో, అంగోలాలు! దక్షణ అమెరికాలోని బ్రెజిల్‌లో కాగితం పరిశ్రమ, రేయాన్ ఉత్పత్తి నీలగిరిగుజ్జు మీద ఆధారపడివుంది. అక్కడి ఉక్కు పరిశ్రమకు కావల్సిన ఇంధనావసరాలలో 40 శాతం నీలగిరిచెట్ల బొగ్గుద్వారా లభ్యమవుతున్నది. ఇటువంటి బహుళార్థ ప్రయోజనం గల వృక్షరాజం మీద అపవాదు ఎందుకు పుట్టింది, ఎలా పుట్టింది?

యూరప్ ఖండంలోని స్పెయిన్, పోర్చుగల్ దేశాలలో యూకలిప్టస్ తోటలు వున్నాయి. పోర్చుగల్‌లోని ఒక పేపరు మిల్లు, తమకు కావలసిన గుజ్జుకోసం, భారీ ఎత్తున నీలగిరి తోటలు పెంచింది. యాజమాన్యం కొనుగోలు చేసిన నేలలో, నీరుపారే ప్రదేశాలు లేకపోలేదు. ఆ ఫాక్టరీకి కావల్సిన ఈ తోటల వల్ల, భూగర్భ జలనిధులు యింకిపోతున్నాయనే

ప్రచారం, వైజ్ఞానికంగా సమర్థనీయం గాని దుష్ప్రచారం, యాజమాన్యం మీదుండే అక్కసుతో, కార్మిక వివాదం నుంచి, ప దే ళ్ల క్రి తం ప్రారంభమయింది : కాపిటలిస్టులని కాపాడే ఫాసిస్ట్ వృక్షమిది - అన్నారు. హాయిగా ద్రాక్షతోటలు పెంచక 3 లక్షల హెక్టారుల నేలలో, కాగితం మిల్లుకి కావల్సి వచ్చే ఈ చెట్లు ఎందుకని, వారి ఆక్షేపణ. స్వీడిష్ వైజ్ఞానిక బృందం, నీలగిరిమీద మోపబడ్డ నిందలన్నీ నిరాధారమని, ప్రయోగ ఫలితాలతో ధృవీకరించినా వినే దెవరు ?

ఆ తర్వాత మరొక మహాను భావుడు కెన్యా అధ్యక్షుడైన డేనియల్ అరప్‌మోయి, ఇది విదేశీయ చెట్టు, బ్రిటిష్‌వారు ఆస్ట్రేలియానుంచి తెప్పించి యిక్కడ నాటించారు, విదేశీయ చెట్లని మనం బహిష్కరించాలి - అని ఒక ఉత్తరువు జారీ చేశారు. ఆ విధంగా నీలగిరి, కెన్యాలో నిలువ నీడలేనిదై పోయింది.

ఇక, మూడవ ఉదంతం. చిప్కో ఉద్యమ కర్త సుందర్‌లాల్ బహుగుణ, "పరిశ్రమలకు ఉపయోగబడే ఈ చెట్లు, పట్టణాలలో నివశించే భూకామందుల సంపద పెంచుతాయి ; వ్యవసాయకూలీలకు వినియోగపడవు - ఇటువంటివి హానికరం" అంటూ, కర్ణాటక రాష్ట్రంలోని వ్యతిరేకవాదుల ఆందోళనకు మరింత మద్దతునిచ్చారు. చివరకిది పబ్లిక్ ఇంటరెస్ట్ లిటిగేషన్‌గా సుప్రీమ్‌కోర్టుకి వెళ్లింది. ఇలా అనేకులు అనేక విధాల నిలగిరిమీద నిర్హేతుకమైన నిందలు మోపారు.

నీలగిరి చెట్లని వర్షాధారంతో పెంచితే హెక్టారుకి 2200 మొక్కలు నాటవచ్చు. మొదటి సంవత్సరం రు. 3400/- ఖర్చు అవుతుంది ; రెండో సంవత్సరం రు. 1025/- అలాతగ్గుతూ ఏడో సంవత్సరం ఖర్చు రు. 350/- అవుతుంది. ఎనిమిదేళ్ల అయేసరికి, ఒక వెయ్యివాసాలు (30-40 సెం. మీ) 50 టన్నుల కలప వస్తుంది. నాటిన 2200 మొక్కలలో 1800 మాత్రమే చెట్లవుతాయి. ఈ వాసాలు, కలపా అమ్మితే, హెక్టారుకి రు. 50, 000/- వస్తుంది. చెట్టు నరికి కలప తయారు చేయడానికి రు. 15,000/ - మొత్తం ఏడేళ్ల పెట్టుబడి రు. 6,300/- హెక్టారుకి నికరాదాయం రు 28,700/- ఇరిగేషన్ పద్ధతిలో పెంచితే అయిదు సంవత్సరాలలోనే తోట అవుతుంది ; హెక్టారుకి నికరారాదాయం రు 35,000/- ఉంటుంది.

ఖమ్మం జిల్లా సత్తుపల్లి మండలం లోని 'చైతుపల్లి - గంగారం' గ్రామానికి చెందిన మోరంపూడి బ్రదర్స్ నీలగిరి తోటల పెంపకం గురించి, పశ్చిమగోదావరి జిల్లా జంగారెడ్డి గూడెం మండలంలోని 'తాడ్వాయి' గ్రామానికి చెందిన వై. వెంకటరత్నం సాంద్రీయ పద్ధతి గురించి, అదేజిల్లా 'లక్ష్మీపురం' గ్రామంలోని పి. సూర్యారావు 'నీలగిరి' - 'వెదురు' తోటల గురించి, గుంటూరుజిల్లా చెమ్మల్ల మూ

గ్రామంలోని యడ్లపల్లి విశ్వేశ్వరరావు సుబాబుల్ తోటలపెంపకం గురించి యిలా అనేకమంది తమ స్వానుభవాలు ఆదాయవ్యయాలతో, అంచనాలతో, వాటిలోని లాభార్జనతో సవివరంగా చెప్పారు. నీలగిరి పెంపకంలో పాటించవలసిన దశ సూత్రాలూ, తెగుళ్లు-చీడలు, క్రిమికీటకాదుల నివారణకు తీసుకోవలసిన జాగ్రత్తలూ రచయిత కూలంకషంగా బోధపరిచారు.

నీలగిరి తోట పెంచినా పెంచకపోయినా, అటవీసంపదపట్ల మనకు గల సామాజిక బాధ్యతను తెలియజెప్పే గ్రంధమిది. ప్రతి పంచాయతీ గ్రంధాలయానికీ, తమ పుస్తకాల బీరువాలో, ఈ ప్రామాణిక గ్రంధాన్ని భద్రపరచవలసిన నైతిక కర్తృత్వం ఉంది. 1/4 డెమ్మీ సైజులో 280 పేజీలలో గల ఈ పుస్తకాన్ని డా॥ ఎవిఆర్‌జి కృష్ణమూర్తి, ఎంత కష్టపడి రచించారో, ఎటువంటి అపూర్వ సమాచారం సేకరించారో, ఒకసారి చూస్తేగాని తెలీదు.

—సుమతి



కుటిల మనస్కులు తమ తప్పులని తమ నుంచీ, యితరుల నుంచీ కూడా దాస్తారు. సజ్జనులు మాత్రమే తమ తప్పులు బాహాటంగా అంగీకరించగలుగుతారు.

— లారెన్స్



<u>14వ ఉత్సవం - న్యూఢిల్లీలో</u>

# భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ

## Spirit of Freedom Concerts

నవంబరు పద్నాలుగు తమిళనాడ్‌లో వెళ్లుతున్న పార్టీకి గ్రూప్ లీడరు వి. కృష్ణమూర్తి. "ట్రైన్ బయల్దేరే సమయం అయింది. ఇంకా చందూర్ గారు రాలేదే" అని అంటూండగా, "ఆయన యివాళ మనతో రావడం లేదు ఏదో అనివార్య కారణాలవల్ల" అన్నారు కృష్ణమూర్తి.

పదహారున ఢిల్లీ టాల్‌కటోరా స్టేడియమ్‌లో శాస్త్రిగారు మా ప్రయాణం గురించి అడిగారు. నేను చందూర్‌గారి విషయం చెప్పబోతుండగా "అవును, ఏదో అవసరమైన పని వుండటంవల్ల ఆయన రాలేదు. ఈసారి నువ్వు మన ఉత్సవ విశేషాలు వ్రాయి - 'జగతి'లో వేస్తారు; నీకు మరొక బాధ్యత అప్పగిస్తున్నాను" అన్నారు శాస్త్రిగారు.

BCIC వారి జాతీయ సమైక్యతా సంగీతోత్సవాలలో మొదటిరోజు నవంబరు పదిహేడు శుక్రవారం. నగరం అంతా ఎన్నికల హడావుడి, చలి విపరీతంగా ఉంది. అయినప్పటికీ 5.30 గంటలయేసరికి ఆడిటోరియం పూర్తిగా నిండిపోయింది.

V. S. T. ఇండస్ట్రీస్ సహకారంతో నిర్వహించబడుతున్న "స్పిరిట్ ఆఫ్ ఫ్రీడమ్ కాన్సర్ట్స్" ప్రారంభమయాయి. వ్యాఖ్యాతలైన రాధ, విజయలక్ష్మి (బబ్లి)లు - BCIC చైర్మన్ B. D. జట్టీని, V. S. T. మార్కెటింగ్ డైరక్టర్ B. P. సింగ్, భట్టాచార్యను వేదిక మీదకు ఆహ్వానించారు. ఆ తర్వాత డా. యమ్. బాలమురళీకృష్ణ, కిశోరి అమోన్‌కర్, చతురస్య నాట్యంలో పాల్గొనే - కళాకృష్ణ, చారుసిజ మాథుర్, మాధవి ముద్గల్, భారతి శివాజీ లను - ఆహ్వానించారు.

'చతురస్య నాట్య' కార్యక్రమంలో కళాకృష్ణ ఆంధ్ర నాట్యాన్ని, చారుసిజ మాథుర్ మణిపురిని, మాధవి ముద్గల్ ఒడిస్సీ నృత్యాన్ని, భారతి శివాజీ మోహినీ ఆట్టాన్ని అభినయించారు; నలుగురూ కలిపి దశావతారాలను ప్రదర్శించారు.

డా. బాలమురళీ, కిశోరీ అమోన్‌కర్ల జుగల్ బందీలో రసజ్ఞులను ఉర్రూతలూగించారు - కళ్యాణి (కర్ణాటకరీతిలో) యమన్ కళ్యాణి (హిందూస్థానీలో) రాగాలతో! దాదాపు 30 సంవత్సరాల క్రితం AIRలో తామిరువురు పాడిన ఒక అష్టపదిని తిరిగి పాడి శ్రోతలను ఆనందింప జేసారు.

శనివారం మూడున్నరకు ప్రారంభ మయింది. వినాయకుడికి కొబ్బరికాయ కొట్టి హారతి యిచ్చాక కుమరేష్ - గణేష్‌ల వైలిన్ కచేరి, ఆరు గంటలకు పండిట్ జస్రాజ్ గానం సంగీతాభి మానులకు ఒక పసందైన విందు. ముఖ్య అతిథి కాబినెట్ శెక్రెటరీ T. N. శేషన్. భారత ప్రధాని యీ మూడు రోజుల జాతీయ సమైక్యతో త్సవాల విజయాన్ని ఆకాంక్షిస్తూ పం పిన శుభసందేశాన్ని టి వి కె శాస్త్రి చదివి వినిపించారు. ముఖ్య అతిథి శేషన్ క్లుప్తంగా ప్రసంగిస్తూ భారత కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటివారి కృషిని అభినందించారు. తర్వాత అనూరాధా పోడ్వాల్ గానం.

ఇక, ఆదివారం నవంబరు 19. మద్రాసు నుంచి యింత భారీ ఎత్తున వచ్చి ఢిల్లీలో ఉత్సవం జరుపుతున్నా రని తెలియగానే, ఎంతోమంది అభి మానులు ఆ వచ్చినవారిని చూడానికి రావడం సహజం. ఎందరో మిత్రులు చందూర్‌గారిని గురించి వాకబు చేసి, వారు రాలేదని తెలిసి నిరాశ చెందారు. ఆయనకున్న గ్లామర్ అలాటిది. ఈ ఉత్సవాలను రికార్డు చేయడానికి వచ్చిన వారిలోని AIR వారు, ఛీఫ్ కన్వీనరు శాస్త్రిగారిని "మీ కార్యక్రమాలు విదేశాల్లో కూడా నిర్వహించవచ్చు గదా, తద్వారా మన సంస్కృతిని విస్తృత పరిచినట్ల వుతుంది కదా, అని అడగ్గా ఆయన నవ్వుతూ "మన దేశం గురించే యింకా పూర్తిగా నాకు తెలీదు యింటగెల్చాక కదా ...." అని నవ్వేశారు. సరిగ్గా మధ్యాహ్నం 2గ. 05.ని లకు పళని స్వామి నాదస్వరంతో బాలాజీ సంగీత కళ్యాణోత్సవం ప్రారంభమయింది. సాక్షాత్తు ఆ వేంకటేశ్వరుడే సకల ఆభరణాలతో దివ్యతేజస్సుతో దర్శన మిస్తున్నట్లుగా అందరూ భావించారు. పవిత్ర నదీ జలాలతో స్వామివారి అభిషేకం జరిగింది. సమస్త లాంఛ నలతో సత సేవలతో స్వామివారికి పూజలు జరిపించారు. వేదమంత్రాలతో. విశ్వరూపదర్శన, నవనీర్య హారతి, పుణ్యజలాలతో అభిషేకం, స్వామి ఊరేగింపు, కళ్యాణం, పవ్వళింపు సేవ, హారతి, యిలా అన్ని సంప్రదాయ ప్రకారం జరిగాయి. ఈ సేవల నడుమ నడుమ సంగీత, నృత్యాలు ఏర్పాటు చేయబడ్డాయి. భక్త జనావళి బృందం భక్తి సంగీతం, సుందరరాజన్ వైలిన్, కుమారి ప్రియ నృత్యం; వేదవతి ప్రభాకర్, సురేఖల భక్తి సంగీతం; ఉమామురళీకృష్ణ నృత్యం, టి. వి. శంకరనారాయణ్ కర్నాటక సంగీతం. పవ్వళింపు సేవలో బాలమురళీ వేదవతి ప్రభాకర్ తదితర గాయకులంతా కలసి జోలపాడి స్వామి వారిని నిద్ర పుచ్చారు.

ఈ నాడు వచ్చినవారంతా వారి వారి రంగాలలో అతిరథ మహారథులు. సుప్రీమ్‌కోర్టు ఛీఫ్ జస్టిస్ ఇ. వెంకట్రా మయ్య, సుప్రీంకోర్టు జస్టిస్ రంగనాథ్ మిశ్రా, సుప్రీంకోర్టు జస్టిస్ రంగనాథన్, జస్టిస్ రామస్వామి, సిక్కిమ్ ఛీఫ్ జస్టిస్ రఘువీర్, కాబినెట్ శెక్రటరీ శేషన్,

చీఫ్ ఎలక్షన్ కమీషనర్ పేరిశాస్త్రి, సమాచార శెక్రటరీ మురారి, అటార్నీ జనరల్ K. పరాశరన్, కేంద్ర విజిలెన్స్ కమీషనర్ సోమయ్య, లా సెక్రటరీ డా॥ పి. సి. రావ్, లా కమీషన్ మెంబర్ - సెక్రటరీ జి.వి.జి. కృష్ణమూర్తి, ఇన్‌కమ్‌టాక్స్ అపెలేట్ ట్రిబ్యునల్ ప్రెసిడెంట్, సి.హెచ్.జి. కృష్ణమూర్తి, యిలా ఎందరో ప్రముఖులు విచ్చేశారు. ఈ ఉత్సవ నిర్వహణలో జి.వి.జి. ఆనందరావు, నాగరాజు, అర్ధంకి మన్నార్ గరిమెళ్ల రామమూర్తి మున్నగువారు ఎంతో శ్రమించారు. ఉత్సవ విజయానికి తోడ్పడ్డారు. కుల, మత, భాషావిభేదాలకు అతీతంగా, కృషిచేస్తున్న భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ, ఎందరో మహానుభావుల ప్రోత్సాహ సహకారాలతో ఒకొక్క విజయ సోపానమే అధిరోహిస్తున్న ఈ మహాసంస్థకు ప్రధాన వ్యక్తి; టివికెశాస్త్రిగారు (25 మలోని రోడ్, మద్రాసు – 17). ఆయన దీక్షకు, దక్షతకు నిదర్శనం ఈ మూడురోజుల సమైక్యతా సంగీత నాట్యోత్సవాలు.

—స్వరాట్ రావు

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కెయన్ కేసరి



'గృహలక్ష్మి' కంకణ గ్రహీతలైన తెలుగు వనితలు ఈనాడు ఎందరో ఉన్నారు. 'గృహలక్ష్మి' పత్రిక ద్వారా స్త్రీ జనాభ్యుదయానికై కేసరిగారు చేసిన అద్వితీయ కృషి తెలుగువారు మరువ లేనిది. అలాగే కేసరీ కుటీరం, కేసరీ విద్యాలయం వంటివి, ఆయన పేరు చిరస్థాయిగా నిలిపే సంస్థలు. ఆత్మబలం, స్వయంకృషి, అచంచల దీక్షతో, వైద్య శాస్త్రంలోని ప్రతిభను ప్రజోపకరంగా మార్చి, సేవా తత్పర తతో చరితార్థులైన కేసరిగారు తమ జ్ఞాపకాలను పుస్తకరూపంలో 1953 లో వెలువరించారు. ఆదర్శ ప్రాయులు, పుణ్యజీవనులు అయిన ఆ మహానుభావుని జీవితవిశేషాలు, ఆనాటి సాంఘిక పరిస్థితులకి దర్పణం వంటి అనుభవాలు - జులై 1989నెలనుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.

ఇటువంటిది మరియెక్కడను లేదు. ప్రత్యేక పూజారిలేడు. వస్త్రాభరణము సున్న. నీవే జాతివని ప్రశ్నించు వారెవరును లేరు. డబ్బు అడుగు అర్చకుడు లేడు. అయితే బిల్వార్చన, గంగాభిషేకముల భక్తులు స్వంతముగ జరుపుచుందురు. మహత్తు కలిగిన మహాత్ముడు యెప్పుడును నిరాడంబరముగనే యుందురనే న్యాయమును మనము ఇక్కడ గ్రహించవలయును. రాత్రి యెప్పుడూ నిర్జనసమయమున గర్భాలయమును మాత్రము శుభ్రపరచుచుండు వారుండెదరు.

ఈ విశ్వనాథుని దేవాలయమును దర్శించినవారు అనేక విషయములను గ్రహించుటకు అవకాశము గలదు. దేవుడు భక్తిని కోరునుగాని, పట్టువస్త్రములను ఆభరణములను కోరడు ; అట్లుండినను కొన్ని దేవాలయములలో జనులు దేవునకు వెలగలనగలను పట్టుపీతాంబరములను సమర్పించి సంతోషించెదరు. వాటిని కాపాడుటకు ఇనుప తలుపులతో గర్భగుడిని మూసి భద్రపరచెదరు. ఇంత భద్రముగ నుండినను దొంగలు గుడిలోదూరి స్వామి సొమ్ములను అపహరించుచుండుట ప్రతిదినమును మనము వినుచునేయున్నాము. ఈస్వామికి నగలులేవు. తలుపులులేవు. దిగంబరస్వామి. మొదటినాడు గంగాస్నానమును, స్వామి దర్శనమును ముగించుకొని ఇల్లుచేరి భుజించి పరుంటిమి.

మరునాడు మరల గంగాస్నానము, విశ్వేశ్వరుని దర్శనముచేసిన అనంతరము ఊరు చూచుటకు బయలుదేరితిమి. అద్దరిన యుండిన కాశీమహారాజు నగళ్లను చూచుటకు పడవ మీద పోయి చూచితిమి. అ పడవమీదనే గంగానదిలో కొంతదూరము ప్రయాణము చేసితిమి. అనాడు పండు వెన్నెల రాత్రి. ఆకాశమంతయు ధవళచ్ఛాయతో ప్రకాశించుచుండెను. ఆ నిర్మలమైన గంగాతీరముననూ పడవపోవుచున్నప్పుడు గట్టునయున్న గొప్ప మేడలలో నుండివచ్చు వీణాగాన మాధుర్యము మా వీనులకు విందొనర్చుచుండెను. గంగాతీరమున పెరిగియుండిన పూదోటలనుండి వచ్చుచుండు సౌరభ్యమనుభవించుటకు ఆనాడు మాకు ప్రాప్తికలిగినందులకు సంతోషించుచుంటిమి. అ సమయమున అనేకులు పడవలనెక్కి గంగగర్భమున విహరించు దృశ్యము కనులు పండువుగ నుండెను. స్వామిదర్శనము, గంగాస్నానము కంటే నావయాత్ర మనోహరముగ నుండెను. ఈనాడు నాకు కలిగిన అనందమును నేనట్లు మరువగలను ?

మూడవనాడు ఉదయముననే కాలకృత్యములను దీర్చుకొని కర్మకాండ ముగించుకొని బయలుదేరితిమి. గంగాతీరముననున్న హరిశ్చంద్రఘట్టం, అశీ ఘట్టం, మాధవఘట్టం, రామేశ్వరఘట్టం. కేదారఘట్టం, మణికర్ణిఘట్టం

మొదలగు ఘట్టములలో స్నానము చేయుటకు ఒక చిన్నబోటును యేర్పాటు చేసుకొని పోతిమి. ఇంత దూరమున నున్న కాశీక్షేత్రమునకు వచ్చినవా అన్ని ఘట్టములలోను స్నానముచేసిననే పుణ్యము లభించునని తీర్థ వాసులు చెప్పిరి. అయితే ఈకూడా వచ్చిన పురోహితుడు, మావద్ద వుండిన డబ్బంతయు ముగియువరకు కర్మకాండ నుండి మమ్ములను విడువలేదు. ఈపట్టణమున మూలమూలలోను శివలింగములున్నవి. పెద్ద పెద్ద భవనముల యెదుట లింగ ప్రతిష్ఠలుగలవు. ఊరంతయు శివమయముగనే కనుపడినది. ఈ దినముననే భోజనానంతరము బయలుదేరి కాశీలోనున్న ఇతర పుణ్య క్షేత్రములనుకూడా దర్శించితిమి. సాయంకాలము విశాలాక్షి దేవాలయమునకు పోయి అర్చనాది పూజలను సలిపి ఆరోజునకు కార్యక్రమము ముగించుకొంటిమి.

## కాశీలో వ్యభిచార స్త్రీలు

నేను ఇంతవరకు కాశీక్షేత్ర మాహాత్మ్యమును వ్రాసి పిమ్మట, అక్కడి వ్యభిచార స్త్రీలను గురించి వ్రాయవలసి వచ్చినందులకు చాలా చింతించు చున్నాను. ఈ మహత్తర మాహాత్మ్యముగల మహాక్షేత్రమందుకూడా ఒక నల్లటి మచ్చగలదు. బసచేసిన చోట గుమస్తాను తోడుతీసుకొని ఆ పట్టణ మందుండు దివ్యక్షేత్రములనే గాక అనేక స్థలములను కాశీలో ప్రసిద్ధిచెందిన పట్టుపీతాంబరాదుల అంగళ్లను, పాత్రసామానుల విక్రయించు దుకాణములను చూచితిని. అప్పటికి సుమారు సాయంత్రము 6 గంటలైనవి. ఇకను మనము ఇంటికి వెళ్లవలసినదేనా లేక యింకేమైన యిక్కడ చూడదగిన విశేషములు యేమైనను నున్నవా ? - యని అడిగితిని. అప్పుడాయన ఇక్కడ ఒక ప్రసిద్ధమైన వేశ్యలుండు పెద్దవీధి గలదని నీళ్లు నములుతు మెల్లగా నాతో చెప్పెను. నేనొక్కడనే ఆ దినమున పోతిని గనుక అది కూడా చూచెదము రమ్మని ఆ వీధికి పోతిమి. అక్కడికి మేము పోయిన సమయము కనుచీకటి పడుచుండెను. ఆవీధి యిరుప్రక్కలను గొప్ప గొప్ప 3 లేక 4 అంతస్తుల భవనము లుండెను. మేము ఆవీధిన ప్రవేశించగానే అక్కడ సుగంధ పరిమళ ముల ఆనందమును అనుభవించితిమి. అక్కడక్కడ వీణాగానమును, హిందూస్థానీ సంగీతములును, తబల, నృత్యముల శబ్దములను వినుచు ఆ వీధిలో నడుచుచుంటిమి. వారాంగనలు వయ్యారముగ వరండాలలో నిలబడి వీధిన నడుచుచుండు యువకులను వారగంట చూచి చిరునవ్వులతో వారిని ఆహ్వానించుచుండిరి. వీధి చాలా పొడుగైనది గనుక మేము అంతదూరము నడువలేక కొంతదూరమే పోయి ఇంటికి మరలితిమి. నాతో కూడ వచ్చిన

తీర్థవాసి గుమాస్తా ఈ వూరిలోయుండి మంచి శబ్బరలను చక్కగ గుర్తెరిగిన వాడు గనుక వార్లను గురించిన ఈ క్రింద నేను వ్రాసిన కథలను నాతో చెప్పెను.

ఈ పడుపు వృత్తి వ్యాపారస్తులు కొందరు దేవదాసీలనబడు వేశ్యస్త్రీలు. కాశీపట్టణమున నుండు ద్రవ్యమదాంధులు ఈ దాసీలకు దాసానుదాసులై యున్నారు. ఇక్కడే దివ్యభవనములను నిర్మించుకొనియున్న రాజాధిరాజుల వద్దకు వీరు అప్పుడప్పుడు పోయి ఆటపాటలను జరిపి, వార్లను సంతోషపెట్టి మిక్కిలి రొక్కముల నందుచుందురు. వీరు మొదటితెగవారు. రెండవతెగవారు: అత్తమామల పోరుపడజాలక ఇల్లు విడిచి పరుగెత్తి వచ్చినవారును, కారణాంతరముల వలన భార్యాభర్తలకు పొందుకుదరక ఇల్లు విడిచి వచ్చినవారును, ఇంక నిట్టి వారందరు ఈ వీధిన నివసించుచుందురు. మూడవతెగవారు: బాల్యవివాహముల వలన అనాథలయి, సనాతన ధర్మ ప్రవర్తనలకు దూరులయి, తలిదండ్రాదుల కఠినశిక్షలకు తాళజాలక ఇలు విడిచి కడపట కాశీ క్షేత్రమే గత్యంతరము అని వచ్చిచేరినవారు కూడ ఈ వీధియందున గలరు.

మరియు నాల్గవతెగవారు: భర్తలను పోగొట్టుకొని ప్రపంచ సుఖముల నపేక్షించి పురుషుల వలలలో చిక్కుకొని, సంఘదౌర్జన్యమునకు భయపడి, కాశీక్షేత్రమునకు వచ్చి, వైద్యాలయములలో ప్రసవింతురు. వారు తాము కన్న శిశువులనందే విడిచివచ్చిన, ఆ వైద్యాలయాధికారులు ఆ శిశువులను అనాధ శరణాలయములకు అప్పగించెదరు. అట్టి బిడ్డలను ఈ వీధినయుండు వ్యభిచారస్త్రీలు డబ్బిచ్చి తీసుకొనివచ్చి పెంచి పెద్దచేసి ఈ వృత్తిలో దించగా ఆ విధమున జీవించువారును ఈ వీధిలో నున్నారు. ఈ విధముగ ఈ వీధి వ్యాపారము దినదినాభివృద్ధి గాంచుచున్నది. మనదేశపటమున వున్న ఈ నల్లటిమచ్చ తెల్లబడితేగాని మనము చల్లబడము.

## గయ క్షేత్రము

అచ్చటనుండి గయాక్షేత్రమునకు వెళ్లితిమి. గయాలో గయావళుల వేతికి చిక్కితిమి. యాత్రికులగు దూరదేశస్థులకు, అచ్చట ఆచారవ్యవహారములు తెల్పి, యాత్ర సుఖకరమగునట్లు చూచుటకై ఏర్పడ్డవారు వీరు. మమ్ము ఒక గల్లీలోనుండు నొకయింట బస కుదిర్చి ప్రవేశపెట్టిరి. ఆయిల్లు చాలా చీకటి గదులతో కూడుకొన్నది. చాలా అపరిశుభ్రముగా కూడా నున్నది. గయా శ్రాద్ధమును హోటలులో పెట్టునట్లు ఏర్పాటుచేసిరి. మేము పెట్టు శ్రాద్ధములలో బ్రాహ్మణార్థము చేయవచ్చిన గయావళులు, అంతకుముందే ఆ హోటలులోనే

పెట్టబడిన శ్రాద్ధములలో పాల్గొన్నవారే. మేమున్నూ అక్కడనే ఒకప్రక్క కూర్చున్నాము. దర్భతంత్రము జరిగినది. ఆకులువేసినారు. కడుపునిండి యున్న గయావళులు త్రేన్పుతూ, ఆకులముందు కూచున్నారు. పసుపు కలిపిన అన్నమును, పాయసమును మాత్రము గుర్తించగలిగితిమి. తక్కిన పదార్థములను గుర్తించలేకపోయితిమి. అయితే మాకు బాగాతెలిసిన గడ్డ పెరుగు కూడా వడ్డించిరి. భోక్తలుగా కూర్చున్న గయావళులు వండి వడ్డించిన పదార్థములలో ఇష్టమైనదానిని రుచి మాత్రము చూచిరి. పిమ్మట వృక్షము వద్దకు మమ్ములను తీసుకొనివెళ్లినారు. అక్కడివారికి వంటినిండా గంధము పూసి పూజించి దక్షిణ యివ్వవలయును. పితృదేవతలను తలచుకోవలయును. కర్తలు ప్రమాణపూర్తిగా నేను యింతమాత్రమే దక్షిణ యివ్వగలనని చెప్పవలెను. అట్లా చెప్పని యెడల - 'గయాశ్రాద్ధ ఫలితమస్తు' అని వీపున గట్టిగ కొట్టరు. ఆదెబ్బను వారు గట్టిగ కొడితేగాని వచ్చినవారు స్వర్గలోకము నకు పోరట! కనుక యాత్రికులు అబద్ధమాడిన దెబ్బతిని తృప్తిచెంది యింటికి వచ్చెదరు. గయలో పనిలేనివారంతా 'గయావళీ' ఉద్యోగమున కమరుదురట.

అంత శివక్షేత్రమునుండి ఈ విష్ణుక్షేత్రమునకు వచ్చితిమి. ఈ క్షేత్రమునకు పేరు విష్ణుగయ. ఇక్కడ పారునది ఫల్గుణీనది. ఈ నదిలో జలము ఎడతెగక పారుటలేదు. అక్కడక్కడ చలములను త్రవ్వుకొని జనులు స్నానమును చేయుదురు. గంగాస్నానమును చేసిన పిమ్మట ఈ ఫల్గుణీ నదిలో స్నానమును చేసినవారి మనసు యెటులుండునో పాఠకులు గ్రహించుదురు గాక. అయితే ఈ ఫల్గుణీనది శ్రీరామచంద్రాదులు స్నానముచేసి పిండపితృ తర్పణములను చేసిన పుణ్యతీర్థము గనుక దీనిని పవిత్రముగ నెంచెదరు. ఇక్కడికి పోయినవారు మొదట ఈ నదిలో స్నానమాచరించి పితృదేవతలకు పిండమును పెట్టెదరు. ఈ పిండము పెట్టు సమయమున మాతాపితృ దేవతలనేగాక బంధుమిత్రాదులనుకూడ దలచుకొని తర్పణమును విడుచు నప్పుడు మనసునకు కలుగు విచారము వర్ణించుట సాధ్యముకాదు.

## విష్ణుపాదము

ఫల్గుణీ నదీ తీరమున జరిపిన కర్మ కాండానంతరము విష్ణుపాదము నందు రెండవసారి పితృదేవతలను దలచుకొని పిండ పితృ తర్పణములను జరుప వలయును. శ్రీమహావిష్ణుని పాదస్పర్శ సోకిన స్థలమిదియని స్థలపురాణమున గలదు. అనేక సంవత్సరములుగ అనేకులు ఈ పురాతన పుణ్య స్థలమునకు వచ్చి పితృదేవతలను తలంచుకొని కృతార్థులయిరి. వంగదేశమున వైష్ణ

మతస్థాపకుడైన శ్రీకృష్ణ చైతన్యుడు ఈ విష్ణుపాదదర్శనమును చెయకమునుపు నాస్తికుడుగ నుండెను. ఈ విష్ణు పాదదర్శనమే వీరిని నిర్వికల్పమైన విష్ణు భక్తునిగ చేసినది. పిమ్మటనే వంగదేశ మంతటను వీరి ఉపదేశమున కోటాన కోట్ల జనులు కృష్ణభక్తులయిరి.

## అక్షయ వట శ్రాద్ధం

మూడవసారి శ్రాద్ధముచేయవలసిన స్థలము 'అక్షయవట' మను వట వృక్షము క్రింద. ఇక్కడనే కడపట శ్రాద్ధమునుబెట్టి గయాక్షేత్ర యాత్ర ముగించుకొనవలయును. ఇక్కడ మేము గయావళుల చేతులలో చిక్కితిమి. యమధర్మరాజు భటుల చేతనుండి తప్పించుకొనుట సులభముగాని ఈ గయా వళుల చేతినుండి తప్పించుకొని బయటబడుట అంత సులభముకాదని నాకు తోచినది.

వీరు నీతినియమము లేక తరతరములుగ యాత్రీకులను బాధించి సంపా దించిన ధనమదాంధులు. వీరు నివసించు భవనములు ఆకసము నంటుచుం డును. వేళ్లనిండుగ వజ్రపుటుంగరములను మెడనిండుగ నవరత్నమాలలను ధరించుకొని పట్టుపరుపుల మీద పరుండి హుక్కాను పీల్చుచుందురు. వీరి గుమాస్తాలువచ్చి దర్శనమును చేయించుదురు. గుమాస్తాలే కర్మకాండను ముగించెదరు. ఈ పెద్ద గయావళీలు కోటీశ్వరులుగ కూడనున్నారు. రాజాధి రాజులు యిక్కడికి వచ్చినప్పుడు శ్రాద్ధ సమయమున పెద్దగయావళులు ఏనుగ మీద నెక్కివచ్చి ఆ ధనవంతులను పీడించి ధనమును సంపాదించుదురు. 'గయా శ్రాద్ధఫలితమస్తు' దెబ్బను తిన్న పిమ్మటనే మన పితృదేవతలు స్వర్గము నకు పోయెదరు. అయితే ఈ గయావళీలు మాత్రము నరకమునకే పోవుదురుని నా అభిప్రాయము. వీరనుభవించు రోగములను చూచితిని. వీరుచేయు అన్యాయములను చూచితిని. వీరి వంటినిండుగ నవరత్నాభరణములు వ్రేలాడు చుండినను, ముఖమున ప్రేతకళలు తాండవమాడుచుండెను.

అట్టి పురాతన పుణ్యభూమియందు వీరు చేయుచున్న దురాగతములను దేవుడెట్లు సహించుచున్నాడో తెలియదు.

ఆ మహాపుణ్యక్షేత్రమగు కాశీపట్టణమందుకూడ ఒక భాగమున పాపక్షేత్ర ముండి నటులనే ఇక్కడకూడ గయావళీల బృందము కలదు. వెలుతురు చీకటి వెంట వెంట యుండినటులనే పుణ్యపాపములు కూడియుండును.

ఈ సమయమున వారివారికి ప్రీతికరములైన ఆహారపదార్థములలో దేని నైనను ఒక దానిని వర్జించునట్లు ప్రమాణమును చేయవలయును. నేను నా

భార్య పనసకాయ కూరను విడిచిపెట్టితిమి. నాతోకూడ యుండిన నల్లూరి విస్సాలక్ష్మి నరసయ్య వారి భార్య యిరువురు దేవదారు ఆకుకూరను విడిచి పెట్టిరి. వెంగయ్య పంతులుగారు దానిమ్మపండును విడిచిపెట్టిరి.

## బుద్ధగయ

ఈ క్షేత్రము విష్ణుగయనుండి సుమారు 8 మైళ్ల దూరముననున్నది. విష్ణుగయ నుండి మేము ఇక్కడికి వచ్చిచేరితిమి. హిందువులకు కాశీక్షేత్రము యెంత పావనమైన స్థలమో, ఈ బుద్ధగయ బౌద్ధులకు అంత పావనమైనది. దీనిని బోధగయని కూడ పిలిచెదరు. ఇది శ్రీ బుద్ధభగవానుడు జ్ఞానసిద్ధిని పొందిన స్థలము. పూర్వమున మహాబోధియను ప్రసిద్ధిచెందిన వృక్షము క్రిందనే వీరు సిద్ధిని పొందిరి. ఆ మహాబోధి వృక్షము ఇప్పటికిని ఇక్కడ నున్నది. అశోక చక్రవర్తి ఇక్కడికి వచ్చినట్లు శిలాశాసనములు యింకను యిక్కడనున్నవి. బౌద్ధమత ప్రచారకోత్తముడును అద్వితీయ గుణసంపన్నుడును అగు ఆ చక్రవర్తి శిలావిగ్రహమును ఇక్కడ ప్రతిష్టింపబడి యున్నది.

ఈ క్షేత్రమును దర్శించుటకు ఇప్పటికిని నానాదేశములనుండి జనులు వచ్చుచున్నారు. ప్రతిదినము యిక్కడ చైనా, జపాన్, సిలోన్, బర్మా మొదలగు దేశముల నుండి వచ్చువారిని చూడవచ్చును. 'రాజగృహం' యను స్థానము నుండి బుద్ధుడు మత ప్రచార ప్రారంభమును చేసినను ప్రపంచమునంతయు సూక్ష్మదృష్టితో చూచుచు సిద్ధిపొందిన స్థలమిది. ఈ పుణ్యప్రదేశం బౌద్ధుల కేగాక సత్యమెరిగిన వారి కందరికిని మహాపుణ్యభూమియని చెప్పుటకు భేదాభిప్రాయము లుండవు. ఇప్పుడిక్కడ నుండు బౌద్ధదేవాలయములలోని అర్చకు లందరు హిందువులు. ఏలననగా - బుద్ధదేవుని శిష్యుల నందరిని శ్రీ శంకరాచార్యుల వారి శిష్యులు వాద ప్రతివాదములందు ఓడించిరి. అప్పటి నుండి హిందూమతస్థులే బౌద్ధాలయమును పాలించుచున్నారని ఇక్కడ స్థలపురాణము. ఈ క్షేత్రమును దర్శించి మేము తిరిగి విష్ణుగయకు వెళ్లితిమి.

## ప్రయాగ (అలహాబాదు)

మేము కాంగ్రెసుకు హాజరగుటకు మొదటనే ప్రయోగ క్షేత్రమునకు పోతిమి. అయితే ఆ సమయమున అక్కడ జనసమ్మర్ధము అధికముగ నుండుట వల్లనే మహాసభహడావుడి అసౌకర్యము లధికముగ నుండినందునను తిరిగి వచ్చునప్పుడిక్కడ దిగి నిదానముగ స్థలము చూడదలచుకొని కాశీకి వెళ్లితిమి.

ప్రయాగ మహాక్షేత్రమున మహనీయులెందరో పూర్వము యజ్ఞయాగాది క్రతువుల జరిపినందున ఈ క్షేత్రమునకు ప్రయాగ యను పేరు కలిగినదట. ఇక్కడ గంగాయమునా నదులు సరస్వతి అంతరవాహినిగా చేరి పారువట్టి కూడలి. ఈ కారణమున ఈ సంగమస్థానమునకు త్రివేణియను పేరుగల్గినది.

కాశీయాత్రకు వచ్చినవారు ముఖ్యముగ ఈ త్రివేణి సంగమము నుండియే గంగను తీసికొనిపోవుదురు. ఇక్కడ పారు జలమునకే అత్యంత మహాత్మ్యముండి నటుల దెలిసికొనిరి. పాశ్చాత్య శాస్త్రవేత్తలుకూడ ఇక్కడి జలమును పలువిధములుగ పరీక్షించి ఈ జలమున రోగబీజముల నశింపజేయు శక్తిగలదని నిరూపించిరి. అందువల్ల ఈ జలమును పాత్రయందుంచి సీలు వేసిన యెన్నిసంవత్సరములైనను జలము చెడిపోక శుద్ధముగ నుండును. మరియు ఈ జలమును తామ్రపాత్రయందుంచుట మహావిశేషము. తామ్రమునకు క్రిమి కీటికాదులను నశింపజేయు శక్తిగలదు. ఈ కారణముననే మన పూజాపాత్రలను తామ్రముతో చేసిరి. వాటినే వాడుచుండు పూర్వీకుల ఆచారము యిప్పటికిని కలదు. రోగక్రిమి నాశనమునకు రాగితాయిత్తులనే బిడ్డల మెడల లోను మొలలకును కట్టుదురు. ఈవిధముగ హిందువులకు ఆరోగ్యసూత్రములతో కూడిన ఆచారము లెన్నియో కలవు.

త్రివేణి సంగమం మధ్యకు మేము పసుపు, కుంకుమ, పండ్లు, రెవిక మొదలగు వాయనపు సామానులను తీసికొని పడవనెక్కిపోతిమి. పురోహితుడు కూడయుండి మంత్ర తంత్రములను జరిపిరి. అలహాబాదు పరిశుభ్రమైన పట్టణము కాదు. సాధారణముగ గొప్ప క్షేత్రములన్నియుగూడ పరిశుభ్రముగ నుండవు. ఈ పట్టణమున గొప్ప గొప్ప భవనములతో లక్ష్మి తాండమాడుచుండినను దరిద్రదేవత విచ్చలవిడిగ విహరించుచుండుట చూడవలసి వచ్చెను.

సంగమ సమీపమున ఔరంగజేబు కోట యుండెను. ఇది పురాతన కట్టడమైనను అతి గంభీరముగ నుండెను. కోటలోపల హిందువుల దేవాలయములున్నవి. అక్షయవటమను వటవృక్షము యిక్కడ కలదు. ఆ వృక్షమును యిప్పటికిని హిందువులు భక్తిశ్రద్ధలతో పూజించుచున్నారు. ఈ వృక్షము ఔరంగజేబు కాలము నుండి వున్నట్లును, మరణానంతరము స్వర్గమునకు పోదలచుకొన్నవారు ఈ చెట్టుకొమ్మన ఉరి దీసుకొను న్యాయము ఆ కాలమున ఉండినట్లును ఇక్కడి స్థలపురాణము. ఈ కోటలో యిప్పటికిని చిన్నచిన్న దేవాలయములు, పవిత్ర స్థలములున్నవి.

# జగన్నాధము

ఇక్కడనుండి జగన్నాధము చేరితిమి. జగన్నాధమున ఒక ఉరియా మంగలి తీర్థవాసునింట దిగితిమి. అక్కడ మనము వంట చేసుకొని భోజనము చేయగూడదట. దేవాలయములో వండిన పదార్థమునే దేవతా ప్రసాదముగ భుజించవలయును. గనుక అక్కడి మంగలి, కుండలతో వండిన అన్నమును, పప్పును మట్టిపాత్రలతోనే తెచ్చి మాకు పెట్టెను. ఇక్కడ దేవాలయములో 7 కుండల దొంతి మీద అన్నమును వండెదరు. అనగా 7 కుండలలోను బియ్యము నీళ్లు కలిపి ఒక దానిమీద యొకటిగా పొయిమీద పెట్టెదరు. అవి అన్నియు ఒకే సమయమున పచనమగును. ఇట్లు వండిన అన్నమే స్వామి ప్రసాదము. ఈ ప్రసాదమును వైదిక శిఖామణులున్నూ ముందు ముత్తైదువలు సహా—ఏవగింపులేక భుజింతురు. ఏవగించినచో కండ్లు పోవునట! ఇక్కడకూడ తీర్థవాసులతో చాలా కష్టమున్నది. వీరున్నూ యాత్రికులను పీడించి పెద్ద మొత్తములను వాగ్దానము తీసుకొనెదరు. ఉన్న మటుకు మొదట తీసుకొని మిగత సొమ్మునకై ప్రతినెల జాబులు వ్రాయచుండెదరు. ప్రసాదమును పంపుచుండెదరు. మన పైవిలాసములను తీసుకొనెదరు. కొంతకాలమైన తర్వాత వారే వసూళ్లకు బయలుదేరుదురు. అందువల్ల కొందరు తప్పుపేర్లను వార్లకుయిచ్చి తప్పించుకొనెదరు. మహా క్షేత్రమును ఆడినమాట తప్పకూడదనే వారున్నూ చాలామంది కలరు.

ఇచ్చట తీర్థవాసులు తరతరాలుగా నావృత్తి నవలంబించియుందురు. వీరు యాత్రికుల గోత్రనామావళులతోసహా రికార్డు నుంతురు. ఆ రికార్డు అంతయు వారికి హృత్కవిలియే. యాత్రికులకు, వారు స్వామికిచ్చు భోగమునకు (నైవేద్యపు పడి) రశీదు లిప్పింతురు. వారి సంతతులవారు వెళినపుడు ఊరిపేరులు కనుక్కొని పూర్వము వారి పూర్వులు అర్పించిన భోగము నుండి ప్రసాదము తెచ్చి యిత్తురు.

ఇచ్చట జగన్నాథుడు ముఖ్యదేవుడు. బలరామస్వామియు ఉపదేవత ఇక విచ్చట స్త్రీ దేవత లక్ష్మిగాని, రుక్మిణిగాని గాక సుభద్ర - ఇది అపూర్వము. జగన్మోహనాకారుడైన శ్రీకృష్ణభగవానుడు తన చెల్లెలి కట్టి వరమిచ్చెనని ఏదో పుక్కిటి పురాణమును చెప్పుదురు. ఇచ్చటి విగ్రహములు మామూలు అన్ని దేవాలయములలోవలె శిలానిర్మితములు కావు. దారు (కొయ్య) నిర్మితములు - ఇదియు అపూర్వమే. ఇచ్చట వర్ణ వివక్షత గాని, ఎంగిలి, అంటుగాని పాటించని కారణముననే "సర్వం జగన్నాథము" అనే సామెత వెలసినది.

కాశీయాత్ర అనంతరము కొన్నాళ్లకి కేరళ యాత్రకు బయలుదేరితిని.

# కేరళ దేశయాత్ర

శ్రీ దివాన్ బహుదూర్ దొడ్డ రాఘవయ్యగారు ఆ రోజులలో తిరువనంత పురంలో (తిరువాన్కూరు) దివానుగా నుండిరి. ఆ సమయముననే నేను మళయాళ దేశ యాత్రకు బయలుదేరితిని. శ్రీ రాఘవయ్యగారు నాకు చిరపరిచితులు. అందుచే ముందుగా తిరువనంతపురమునకు వెళ్లితిని. వీరు నాకు పద్మవిలాసమను భవనమున బస కుదిర్చిరి. అచ్చట నాకు కావలసిన అన్ని ఏర్పాట్లు చేయబడినవి. పద్మనాభస్వామివారి దర్శనము చేయించిరి. ఇచ్చట తిరువాన్కూరు రాజ్యమంతయు శ్రీ పద్మనాభస్వామి వారిదనియు వారి ప్రతినిధులుగా వారి దాసులై తాము రాజ్య మొనర్చుచున్నా మనియు ఈ రాజులు భావింతురు. రాజ బిరుదములలో 'పద్మనాభదాస' అనునదియు కలదు. అనంత పద్మనాభస్వామివారి విగ్రహము చాలా గంభీరముగ నుండును.

శ్రీ రాఘవయ్యగారు నాయందలి మైత్రిచే నాకు ఒకరోజున వారి యింట విందు గావించిరి. ఆ రోజున మద్రాసు హైకోర్టు జడ్జీగారగు శ్రీ కుమారస్వామిశాస్త్రిగారున్నూ వారి కతిథులుగా వచ్చియుండిరి.

తిరువనంతపురం సంస్థానములోనుండు ప్రతిక్షేత్రమును దర్శించుటకు అక్కడి సర్కారు ఉద్యోగస్థులకు దివానుగారు ఉత్తరములు వ్రాసి నాకు చక్కని ఏర్పాట్లు గావించిరి. ప్రతిస్థలములోను స్వామి దర్శనమునకు భోజనమునకు చక్కని ఏర్పాట్లను కుదిర్చిరి.

## కన్యాకుమారి

అక్కడనుంచి మేము మొట్టమొదట కన్యాకుమారి క్షేత్రమునకు పోతిమి. అక్కడ సర్కారు సత్రములో దిగితిమి. ఆ సత్రములో యుండే భావిని చూచినప్పుడు గుంటూరు బావులు నాకు జ్ఞాపకమునకు వచ్చినవి. వంటవాడు వంటచేయులోపల మేము సముద్ర స్నానమునకు వెళ్లి వచ్చితిమి. ఇచ్చట పడమటి సముద్రము, తూర్పు సముద్రము, సంధించు స్థలము. భారత దేశమునకు కొన యిది. ఇక్కడ అలలు ఉరవడిగా కొట్టుకొనుచుండును. అందుచే స్నానమొనర్చువారికి ప్రమాదం లేకుండా లావాటి ఇనుప గొలుసులను అడ్డముగా కట్టియుంచిరి. అక్కడి క్షేత్రవాసులు శ్రీరాముడు ఇక్కడనుండియే వారధికట్టి లంకపై దండెత్తెనని చెప్పుదురు. అవిగో పెద్దరాళ్ల వంతెనను చూడుడు అని వారు చూపుదురు; కాని వార్ల కవి అగపడినట్లు మనకు కనబడవు. ఇదియే సేతుబంధన స్థలమనెదరు. స్నానానంతరము దేవా

లయమునకు వచ్చి అమ్మవారిని దర్శించి పూజించితిమి. అమ్మవారి విగ్రహ మునకు పసుపు దట్టముగ మెత్తబడి యుండును. పావడను గట్టి శృంగా రింతురు. చూచుటకు 10 సం॥ల కన్యకవలనే యుండును. అమ్మణ్ణి ఎంతో అందముగా నుండును.

ఆ సముద్రతీరమున నల్లయిసుక కనపడును. ఈ ఇసుకతోనే బంగారు నగలను మెరుగు పెట్టుదురు. బ్లాటింగుపేపరు ఈ దేశమునకు రాకమునుపు సిరాతో వ్రాసిన కాగితములపై చల్లి సిరావ్రాత నార పెట్టుటకు ఈ యిసుకను ఉపయోగించేవారు. పూర్వపు కరణాలవద్దను, ఆఫీసులలోను ఇంకను ఇతర ముసద్దీలవద్దను ఈ యిసుక సిద్ధముగా నుండేది. ఈ కన్యాకుమారి అనే ఊరు చూచుటకు కొండప్రదేశమున (Hill Station) కట్టినట్లుండును, సముద్రము వడ్డుని అనుకొని యుండును.

## సుచీంద్రము

ఈ ఊరువిడిచి సుచీంద్రమునకు వెళ్లితిమి. ఇక్కడి దేవాలయము చాల పురాతనమైనదిగాక అందమైనదికూడ. ఈ దేవాలయము కట్టడమున కమర్చబడిన రాతి స్తంభములమీద చెక్కబడిన బొమ్మలసొగసు వర్ణనా తీతము . ఈఊరి సత్రములో మేము దిగితిమి. స్వామి దర్శనమునకు పోయివచ్చులోపల మాగుడ్డలను దొంగ లపహరించిరి. మాకు కొంత బరువు తగ్గినది.

## జనార్దనము

ఇది తిరువనంతపురమునకు సమీపమున వర్కలస్టేషన్‌కు రెండుమైళ్ల దూరమున యున్నది. చిన్న మెట్ట మీద జనార్దనస్వామి దేవాలయము గలదు. స్వామి పానవట్టము క్రిందు గుండ గొప్ప జలధార పారుడు వచ్చి ప్రక్కన యుండే కోనేరులో పడును. ఆ జలము టెంకాయ నీరువలె నిర్మలముగ యుండును. స్నానమునకు హాయిగ నుండును.

## షెంకోట

షెంకోటలో మేము రాజభవనమున దిగి అక్కడనుండి స్టీముబోటులో వైకము ఆలప్పళై, అంబలప్పళై మొదలగు క్షేత్రములకు పోతిమి. పిమ్మట ఎర్నాకుళము పోయి ప్రసిద్ధ వకీలు సుగుణపాయిగారింట బసచేసితిమి. వీరు

సరస్వతి బ్రాహ్మణులు. మత్స్యములను తినుటకు అలవాటు పడినవారు. అనాడు మాకు మాత్రము వడ్డించలేదు. వీరు చేపలు తిందురనే విషయము మాకు తెలిసిన పిమ్మట మాకు అనాడు అన్నము సహించలేదు. అయితే వారిచ్చిన మధుర ఫలహారములతో పొట్ట నింపుకొంటిమి. సర్కారు స్టీముబోటు నెక్కి తాతాపురము పోయి అక్కడ కోకోజం, సబ్బులు, తలనూనెలు వగైరాలను తయారుచేయు పరిశ్రమలశాలను చూచితిమి. అక్కడనుండి మంగళాపురంచేరి, శ్రీనివాసపాయిగారింట దిగితిమి. వీరు నెల్లూరులో కొంతకాలం డిస్ట్రిక్టుజడ్జిగ నుండినవారు. ఇక్కడనుండి మేము ఉడిపికి పోయి కృష్ణుని దర్శనమును చేసితిమి. అనాడు మఠములో స్వాములవారితోకూడ విందారగించితిమి. ఉడిపిలో యెనిమిది మఠములున్నవి. ఈమఠములలో ప్రతిదినము వచ్చినవారి కందరికి అన్నదానము జరుగుట గలదు. అనేక బ్రాహ్మణ కుటుంబములు అక్కడనే స్థిరవాసమేర్పరచుకొని జీవించుచుందురు. అనాడు కృష్ణునికి దేవాలయములో గుడి ప్రదక్షిణ ఉత్సవము జరిగినది. పండువెన్నెల రాత్రి. స్వామి గుడి ప్రదక్షిణము చేయునప్పుడు భక్తులు జాజిపూలను గంపలకొలది తెచ్చి స్వామిమీద చల్లెదరు. గుడి అంతయు జాజిపూలతో నిండి యుండును. వెన్నెలరాత్రి యగుటచే దేవాలయమంతయు పిండి ఆరబోసి నట్లుండును. "పుష్పేషు జాజి" - పుష్పములకెల్ల శ్రేష్ఠమైన పుష్పము జాజి. ఈరాత్రి వుత్సవమును వర్ణించుట సులభము కాదు — ఈదేశమున జాజిపూలు అమితముగ దొరకును. ఈపూలమొగ్గ వూదారంగుగ నుండి, విచ్చిన పిమ్మట తెల్లగనుండును. ఇక్కడనుండి గోకర్ణమునకు పోదలచితిమిగాని వర్షాకాలమగుటచే వీలుకాదాయెను.

## తిరుచూరు

మంగళాపురంనుండి కాలికట్టుకు పోతిమి. అక్కడనుండి తిరుచూరుకు పోతిమి. తిరుచూరులో వడక్కనాథన్‌స్వామిని దర్శించుటకు దేవాలయ ముఖ ద్వారమునకు పోతిమి. అక్కడ గేటుజవాను నాచేత గుడ్డ గొడుగు వుండుట వల్లను, నేను బనియను వేసుకొనినందునను మమ్ములను లోపల విడువలేదు. ఈ రెంటినిలేకుండ లోపలికి పోయి ఈశ్వరుని దర్శించితిమి.

## కుత్తాళము

తిరుచూరునుండి ఈరోడ్‌మార్గమున శ్రీరంగము, మధుర, తిరునల్వేలి చూచుకొని కుత్తాళముకు చేరితిమి. కుత్తాళములో శ్రీమౌనస్వామి మఠములో

జన చేసితిమి. ఈ స్వామి నాకు మద్రాసులో పరిచయమగుటచే వీరు మమ్మాదరించి అనుగ్రహించిరి. అక్కడి ఆకాశగంగలో కొన్ని దినములు తృప్తిదీర స్నానమును చేసితిమి. అక్కడి చల్లని జల్లులలో ఆప్యాయముగ తడిసితిమి. అక్కడి పచ్చిజాజికాయలను, లవంగములను, ఏలక్కాయలను తనివితీరతాకి, రుచిచూచితిమి. అయిదు ఆకాశధారల వద్దకు పోయి త్రోవలోయుండు లతా వృక్షముల సౌందర్య మనుభవించితిమి. కుత్తాళము నుండి తిరిగి వచ్చునప్పుడు మధురలో దిగితిమి.

## మధుర

ఈ మధురలో వారము దినములు మకాం చేసి దేవాలయము యొక్క అద్భుత శిల్పశాస్త్ర ప్రదర్శనమును దినము చూచుచుండినను తనివితీరలేదు. పురాతన హిందువుల గొప్పతనమును దెలుసుకొనుటకు ఈ దేవాలయ గోపురములు, రాతిస్థంభములలో చెక్కబడిన సుందరమైన విగ్రహములే సాక్షులు. ఎంతకాలము యీచిత్రములను చూచినను వింతగనే యుండును. దక్షిణదేశములోయుండు దేవాలయములలోనెల్ల యిదియే గొప్పది. పరిశుద్ధముగ నుండినది. చక్కని యేర్పాట్లు గలది. ఈదేవాలయము మానవులు గట్టినదా లేక దేవతలు గట్టినదా అని సందేహము గలుగుచున్నది. ఈ వూరిలోయున్న నదిపేరు వేగవతి. దేవాలయములోని రాతిస్థంభముల మీద చెక్కడము పని బంగారు చెక్కడమును మించియున్నది.

దేవాలయ దక్షిణభాగము మీనాక్షీదేవికి సంబంధించినది; ఉత్తర భాగము సుందరేశునికి సంబంధించినది. ఇందు అష్టలక్ష్మి మండప మొకటి కలదు. లక్ష్మీదేవి యొక్క 8 రూపములు ఇక్కడ విగ్రహములుగా వేయబడి యున్నవి. ఇక్కడనే మీనాక్షీ సుందరేశుల కథలును చెక్కబడి యున్నవి. ఈమంటపమునకు ప్రక్కననే సుందరమైన గణేశ విగ్రహమున్నూ, ఆరు తలలతో షణ్ముఖస్వామి విగ్రహమున్నూ కలవు. ఆ తరవాత మీనాక్షీదేవి వేటాడు ఆటవికస్త్రీగాను, సుందరేశుడు వేటగాడుగాను చెక్కబడిన చిత్రగాధలున్నవి. ఆప్రక్కన మీనాక్షీనాయక్ - నాయకరాజుల ప్రధానమంత్రి - కట్టించిన మండపమున్నది. నేడది దేవుని ఏనుగల మొగసాలగా ఉపయుక్తము. ఈ ఏనుగలచే గొప్పవారు వచ్చినప్పుడు మ్రొక్కింతురు. గతమున శ్రీ గాంధీ మహాత్ముడు వెళ్లినప్పుడు ఆయన నట్లే గౌరవించిరి. ఆ మొగసాలకు ఇత్తడిరేకు తలుపులు. ఆద్వారమావల - పొత్తామరై (బంగారపు తామరకొలను) - ఉన్నది. దాని చుట్టునున్న అంచుగోడపై - సుందరేశుడు మధురలో గావించిన

64 మహిమలు చెక్కబడినవి. పాండ్యుల పురాతన రాజధాని మధుర. పాండ్యులు పాండవుల సంతతియని గాధ. పాండ్యరాజులు మీనాక్షీ దేవాలయమున పంచపాండవుల విగ్రహములను చెక్కించి యున్నారు.

ఆ లోపలనే సుబ్రహ్మణ్యస్వామి దేవాలయమున కటునిటు వాలి సుగ్రీవుల విగ్రహములు, చంద్రమతి హరిశ్చంద్రుల విగ్రహములు చెక్కబడి యున్నవి. దేవాలయం బయట - తిరుమల నాయకుని సత్రంకలదు. సుంద రేశుడు తిరుమల నాయకునికి ప్రతి సం॥మున్నూ 10 రోజులు అతిధిగా నుందునని వరమిచ్చెనట. స్వామివారు వచ్చి విడిది చేయుటకు అర్హముగా నీ సత్రము కట్టించబడినది. దీనిని కట్టించుటకు 22 సం॥లు పట్టెననియు 10 లక్షల నవరలు ఖర్చెయ్యెననియు చెప్పుదురు. కొంతదూరములో తిరుమల నాయకుని రాచనగుళ్లున్నవి. వాని సౌందర్యము చెప్పశక్యముకాదు. ఆ దర్బార్ మహల్ కన్నుల వైకుంఠమే. సుమారు 60 అడుగుల మధ్య కొలత గలి - దాదాపు 75 అడుగుల ఎత్తున గుమ్మటముగా స్తంభములు లేకుండ కట్టించిన ఆ దర్బార్ మహల్ శిల్పచాతుర్యము చూచియే తీరవల యును. వీటన్నిటిని చూచినప్పుడు విజయనగర ప్రాంతమునుండి దూరదేశ మగు దక్షిణమునకు వచ్చి రాజ్యమొనర్చుటయే గాక ఎంతెంత పనులు చేయించి, ఎంత వైభవ మనుభవించిరో మన తెలుగు నాయకులు అని తోచి, ఆశ్చర్యము, గర్వము కలుగును. మధురకు రెండుమైళ్లదూరములో తిరుక్కై కుంద్రను స్థలములో శివాలయముగలదు.

## రామేశ్వరము

మధురనుండి రామనాధపురం, దర్భశయనం మొదలగు క్షేత్రములను చూచుకొని రామేశ్వరమునకు చేరితిమి. నివసించుటకు మంచియిల్లు దొరికినది. అక్కడ చేరిన మర్నాడు మొదట యాత్రికులు చేయవలసిన కార్యక్రమ కర్మములు మొదట ష్కరకల్యాణము, పిమ్మట చంద్రపుష్కరిణిలో ముక్కు మూసుకొని స్నానము, అటు పిమ్మట దేవాలయములో యున్న బావులలోని శుద్ధోదక స్నానము! బావిలోనుండి చేది పోసిన నీటిబుంగకు ఒక్కటికి అప్పుడు కాని యిచ్చితిమి. తర్వాత లింగార్చన చేసి భోజనమునకు పోయెడివారము. మాకు సంతానము లేకుండుట వలన ఇక్కడ నాగప్రతిష్టను చేయదలచు కున్నాము. ఆ వూరిలో దొరుకు నాగమయ్యలన్నియు ఒకసారి ప్రతిష్ట చేసి తీసి మరల విక్రయించు నవగుటచే నేను మద్రాసుకు వ్రాసి క్రొత్త నాగ మయ్యను తయారుచేయించి పంపమంటిని. అది వచ్చుటకు కొంత ఆలస్యమై నందున మేము యిక్కడ 10 దినములుండవలసి వచ్చెను. 'నాగమయ్య శిల'

రైలు పార్శిలుద్వారా వచ్చినది. ప్రతిష్టకు ముందు చేయవలసిన తతంగము లన్నియు జరిగినవి. మేళతాళములతో కూడ నాగమయ్యను వా రెండు చేతులలో పండబెట్టి దేవాలయమునకు వూరేగుతు పోవలయునని పౌరోహితుడు చెప్పెను. సరేనంటిని. మేము దిగియున్న యింటికి దేవాలయమునకు సుమారు అర్ధమైలుండును. అనాడు సూర్యభగవానుడు తీక్షణముగ నుండెను. మద్రాసునుండి వచ్చిన నాగమయ్య పెద్దదగుటచే భారముగ నుండెను. నాగమయ్యను యెత్తుకొని కొంతదూరము సాగితిని. కాళ్లు కాలుచుండెను. మాడు మండుచుండెను. రెండుచేతులు వణకసాగెను. స్వామిని క్రింద పడవేయుటకు సిద్ధమైతిని. వెంటనే ప్రక్కనున్న నా భార్య 'దేవాలయము దగ్గరకు వచ్చినది; క్రిందపడ వేయవద్ద'ని వేడుకొనెను. పండ్లు బిగపట్టి కొంతదూరము సాగితినిగాని పౌరోహితుని సహాయములేక గుడి చేరలేకపోతిని. స్వామిని దించితిని. అయన ప్రక్కననే నేను కూడ కొంతసేపు కూర్చుండి అలసట తీర్చుకుంటిని. నాగప్రతిష్ట మంత్రతంత్రములతో జరిగెను. ఆ వూరు విడచివచ్చునాడు మనము ప్రతిష్ఠ చేసిన నాగమయ్యను చూచిపోవుదమని యిరువురము గుడికి పోతిమి. మేము ప్రతిష్ట చేసిన నాగమయ్య మాయ మైనాడు.

రామేశ్వరములో దేవాలయము చాలవైభవముగా నుండును. ఇచ్చట నాజూకైన శిల్పచాతుర్యముకన్న డౌలుహెచ్చు. శివాలయమున గర్భగుడికి చేరబోవునప్పుడు ఇరువంకలనున్న ఎత్తైన విగ్రహములు, పైని అచ్ఛాదన చూచుకొలది - ఉభయ పార్శ్వముల బారులుతీరి ఉండే సామంతరాజులు, సేనానులు మొదలైనవారి మధ్యనుంచీ రాజదర్శనార్ధము పోవుచున్నాము - అనిపించును. దీని నీవిధముగా నాటుకోటిచెట్లు లక్షలాది వెచ్చించి కట్టించి నారందరు.

## తంజావూరు

తంజావూరులోయున్న రాజాసత్రమున దిగితిమి. దేవాలయమునకు పోయి బ్రహ్మాండమైన లింగమును చూచి పూజించితిమి. ఎదురుగానున్న పెద్దవృషభమును చూచి ప్రదక్షిణముచేసి తాకి అనందించితిమి. ఈ దేవా లయము చుట్టు అగడ్తగలదు. పూర్వపు తంజావూరు రాజులు ఈ దేవా లయమునే కోటగా కట్టుకొనిరి. దేవాలయపు ప్రహరీ గోడలు చాల పొడవై నవి. శిధిలమయిన స్ధితిలో యున్న శ్రీ సరస్వతి భాండాగారమునకు వెళ్లి నమస్కరించితిమి.

ఈ తంజావూరు దేవాలయము 1000 సం॥ల నాటిదని చెప్పుదురు. ఈ దేవుని పేరు బృహదీశ్వరుడు. గోపురమున కెదురుగా - బలిపీఠమున్నది. అక్కడ కాకులకు బలివేయుదురు. తంజావూరునందు తెలుగు నాయకులు కొన్నాళ్లు రాజ్యము చేసి, సంగీత సాహిత్యములను హెచ్చుగా పోషించిరి.

## తిరువయ్యూరు

తంజావూరికి సమీపమున తిరువయ్యూరు పంచనదీ తీరమున వున్నది. ఇక్కడనే మన త్యాగయ్యగారు నివసించి, రాముని భజించి, కీర్తిని బడసిరి. వీరి సమాధికి ప్రదక్షిణమును చేసితిమి. వారుండిన యింటికి పోతిమి. ఆ యింటివారు త్యాగయ్యగారు ఆరాధించుచుండిన పురాతనపు శ్రీరామ పంచాయతం దేవతార్చన మందసమును చూపిరి.

మేమును ఆ దేవునికి నమస్కరించితిమి. అక్కడ కొంతసేపు కూర్చుని దాహమును తీర్చుకుంటిమి. ఇప్పుడక్కడ బెంగుళూరు నాగరత్నంగారు చాల ధనమును ఖర్చుపెట్టి, దివ్యమైన భవనమును కట్టించి ఏటేటా త్యాగయ్యగారికి ఉత్సవములను జరుపుచున్నారు. ఈ వుత్సవమునకు గొప్ప విధ్వాంసు లందరువచ్చి కచ్చేర్లు చేయుచున్నారు. ఈ వైభవము చూడదగినదట.

## శ్రీరంగం

తంజావూరునుండి శ్రీరంగము చేరినాము. శ్రీరంగదేవాలయ గోపురము దర్శించగనే

"కావేరీ గిరియాత్తోయం వైకుంఠ రంగమందిరం
పరవాసుదేవో రంగేశ ప్రత్యక్షం పరమం పదం"

అని స్మరించుచు ఏకాదశి సత్రమున దిగితిమి. ఆనాడు మధ్యాహ్నము రాత్రియును రంగని సేవించి పూజించితిమి. మరునాడుదయముననే పోయి విశ్వరూప దర్శనమును చూచి సంతసించితిమి. కావేరి కొల్లడములో, బ్రహ్మముళ్లతో స్నానమును చేసి అయ్యంగారి పురోహితునకు దక్షిణను సమర్పించితిమి. దేవాలయమునకు పోయి పులిహోర, దధ్యోజనము, నేతిగారెలను కొనుక్కొని యింటికి పోతిమి. భోజనానంతరము గుడిలోని విశేషములను చూచుచు వడ్డుదంచు శాలను చూచితిమి. సాయం సమయమున రంగనాధుని ఉంపుడుకత్తెయగు బీబీనాంచారును చూచితిమి. ఆనాడుకూడ స్వామికి తురక పెండ్లాము కావలసివచ్చినది. (ఇంకా వుంది

# విలువలు

అకస్మాత్తుగ
ఒక సంగతి
కనుగొన్నారు
చింత చెట్టు మీద
సాలు ఒకటికి
ఇరవయి వేలు
ఆదాయం అని.

కాలం కరుణించింది
చింతకు గుర్తింపొచ్చింది
చల్లని నీడలు
చిగురుల పప్పులు
పూవుల వరుగులు
పుల్లని కాయలు
అందరికీ పంచే
చింతకు గుర్తింపొచ్చింది.

అల్లరి పిల్లల
అంతర్వత్సుల
జిహ్వాలచే
వహ్వా
అనిపించే
చింతకు గుర్తింపొచ్చింది.

అశోకుడో అక్బరో
ఏ భూపతి అయితేనేం
నాటిన భూరుహాలు
రహదారుల కటూ యిటూ
ఇప్పటికీ
కాలినడక పాంథునికీ
మర్సిడెస్ మహరాజులకూ
పచ్చని స్వాగతాలు
నిత్య తోరణాలు.

విజయసారథి
తన నీడన రథమాపాడా
పండితుడా దవ్వల
పురాణ శ్రవణం
గావించాడా
పేరు ఫలంకోసం
పోరాడలేదు
పాపం చింత!

పరిమళ పారిజాతమా
రసాలూరించే రసాలమా
కలకంఠాల కాలవాలమా
కవితా కీర్తి, వుపమల భజనా
లేనే లేవు
చివరకు
సామూహిక సన్మానం.

కనీసం
పసి వయసులో
కడివెడు నీళ్లూ
కోరలేదు.

ఊరవతలికి వెలివేసి
చీకట్లకు ప్రతీక
అన్నా -
వూరుకుంది.
మున్నెన్నడు
రాలలేదు
పళ్ళు
పోనీ
కాయలు
మంత్రాలకు.

పురోగమనంలో
యుగం మారింది
తింత్రిణీ వృక్షాలపై
తిష్ఠ వేసుకున్న
పిశాచాలకు
నిశాచరులకు
అమరత్వమూ
అశేష యశోధనమూ
రాలుతున్నయి.

ఈనాటికి
చింత జీవితానికి
అర్థం లభించింది.
అకస్మాత్తుగా
ఒకరోజు
అమ్మ విలువ
ఎక్కువే
అని ప్రకటిస్తారు.
కమ్మని వంటల కింతా
కొసరి వడ్డనకు కొంతా
ఓరిమికీ
చల్లని ఓదార్పులకూ
సేవలకూ
శుశ్రూషలకూ
స్రవించిన అశ్రువులకూ
తూకంవేసి
కిమ్మతు ఎంతో
కడతారు.

అన్నపూర్ణ, యింటికి దీపం
అనురాగవల్లి, కన్నతల్లి
ఈ మాటలు
నిరర్థకం.
ఆమె
పనుల వెల
నెలకు
ఇన్ని వేలు
అంతేనే
సార్థకమంటారు.
అకస్మాత్తుగ
ఏదో ఒకరోజు
సామాన్యుడినీ
ఎక్కిస్తారు
అందలం !

ఎదిగే ధరలూ
ఎగిరే కోర్కెలు
ముసిరే పగటి కలలు
ఎన్నో పాట్లు
అయినా ఎట్లాగో
నుదురు చిట్లించి
బొమలు ముడివేసి
ఒక చిన్న నవ్వు
తగిలించి
చూద్దాం
గెలుద్దాం
అనుకుంటూ
సమరం
సాగించే
సామాన్యుడిపై
కాలం
కురిపిస్తుంది
ఒక కరుణా కటాక్షం !

ఒక చేతికి పదివేలు
కాలి ఎముకకి అయిదు
గుండెకాయకి యాభై
మెదడే యిచ్చావో
మరీ మంచిది
పారేస్తాం

ఒక లక్ష
నీ మొత్తం
విలువ
నాలుగు లక్షలు
అనే రోజు
రానున్నది.

అకస్మాత్తుగ
ఒక రోజు
సామాన్యుడికీ
మాన్యత
వస్తుంది
అర్జించిన
అర్థంతో !

15 డిసెంబరు 1988
—సరోజినీ ప్రేమ్‌చంద్

కృపావంతులు ధన్యులు ; ఏలయన వారు కృపను గడింతురు. ధర్మము కోసం హింసలకు గురియగువారు ధన్యులు ; ఏలయన స్వర్గ రాజ్యము వారిది.

వానలు కురిశాయి, వరదలు వచ్చాయి, గాలులు వీచాయి. అవన్నీ ఆ యింటిపై విజృంభించాయి. కాని, అది చెక్కు చెదరలేదు. ఎంచేతనంటే, అది శిలువపై నెలకొల్పబడినది.

నా కోసమై ఇళ్లూ, వాకిళ్లూ, అన్నదమ్ములూ, అక్క చెల్లెళ్లూ, తండ్రి తల్లీ, భార్య పిల్లలూ, ఆస్తులూ - యిలా సమస్తం త్యజించే ప్రతి ఒక్కరికీ అంతకు నూరింతలు లభించి తీరుతుంది - వారు నిత్యచైతన్య జీవితానికి వారసులవుతారు —జీసస్ సూక్తులు

# ముఖచిత్రం

షష్టిపూర్తి (1978) సందర్భంగా రూపాయి నోట్లతో తులాభారం జరిపించుకున్నప్పుడు చెన్నారెడ్డి, అనేక విమర్శలకు గురి అయారు. అయితే, ఈ ఆచారం తెలంగాణా ప్రాంతాన కొత్తకాదనీ, మాడపాటి హనుమంతరావుకి కూడా ఈ విధంగానే తులాభారం జరిపించారనీ మనం మర్చిపోకూడదు .... సుల్తాన్ బజారులో మెడికల్ ప్రాక్టీస్ (1942) ప్రారంభించిన కొదికాలానికీ వైద్య వృత్తి వొదిలేసి రాజకీయాలలో ప్రవేశించారు – ప్రముఖ తెలంగాణా నాయకుడు కొండా వెంకట రంగారెడ్డి మేనల్లుడైన డాక్టర్ మర్రి చెన్నారెడ్డి. 1952 సార్వత్రిక ఎన్నికలలో పార్లమెంటుకి నామినేట్ చేశారు చెన్నారెడ్డిని. ఆంధ్ర ప్రదేశ్ అవతరణ తర్వాత (1956), - ఈయన ప్రతిపక్షనాయకులయారు ; 1962 సంజీవయ్య మంత్రివర్గంలో పంచాయితీ రాజ్ మంత్రి. 1967 నాటి ఎన్నిక చెల్లదనే కోర్టు తీర్పువల్ల, 1969 లో కేంద్ర మంత్రిత్వానికి (స్టీట) రాజీనామా యిచ్చి ఆరేళ్ల అజ్ఞాత వాసం ; ఆ తర్వాత ఉత్తర ప్రదేశ్ గవర్నర్ ; 1978లో ఆంధ్ర ముఖ్యమంత్రి ; తన పార్టీ రద్దు చేసి, కాంగ్రెస్‌లోకి మళ్లీ చేరిన చెన్నారెడ్డి, **ఆంధ్ర ప్రదేశ్‌లో కాంగ్రెస్ విజయానికి** మూల పురుషులయారు.



?

"King Dasaratha issued a royal proclamation to enthrone Sri Rama as the Crown Prince. Dasaratha never said he would leave the kingdom and go into *Vanaprasta....*" said Raghu.

"Yes, you are correct. But the plan has been upset, by the diabolic design of Kaikeyi," observed Raghu's Father.

"My point is how could a responsible king ignore the order earlier issued by him. That develish lady might have asked for the fulfilment of the two boons granted to her ages back. How could Dasaratha do something illegal, improper and immoral ?" asked Raghu.

"Dasaratha did not succumb to anything unethical. The moment he heard Kaikeyi he fell into a stupor and never regained consciousness. The fourteen-year-old banishment to Rama and the elevation of Bharata to the throne - these two were conveyed by Kaikeyi to Rama while Dasaratha was like a log of wood unaware of the happenings. Rama was not that innocent. The entire Ayodhya was behind him except for the lone voice of a maid-servant. To abide to the wishes of the people of obey the mother - that was the question. *Dharma* ordains you to choose always a rigorous path in preference to a comfortable one and Rama chose the rigorous one," explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*






## 1989 నవంబరు 15

మురళీమోహన్ విజయలక్ష్మి దంపతుల కుమార్తె సౌ॥ మధుబిందుకి, విజయవాడ తుమ్మల సూర్యప్రకాశ రావు కుమారుడు చి॥ రంగారావుకి విజయా శేష్‌మహల్‌లో సాయంత్రం 6 గం॥ 34 ని॥లకు శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. వధువు ఎమ్.ఎ. ఫైనల్ చదువుతోంది; వరుడు డాక్టరు (యమ్‌డి - అమెరికా). తెలుగు సినిమా ప్రపంచం యావత్తూ అక్కడే ఉంది. ఎన్నికల ప్రచారం నుంచి మధ్యలో వచ్చిన మురళీమోహన్, రేపటెల్లుండిలో మళ్లీ వెళ్తున్నారు. నవదంపతులకు మా శుభాకాంక్షలు.

## . . . . . 16

హ్యూమన్ రిసోర్స్ డెవలప్‌మెంటు లోని సాంస్కృతిక విభాగమూ, ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్‌వారు (Department of Culture, Ministry of Human Resource Development and Indian Council for Cultural Relations) సంయుక్తంగా మ్యూజిక్ అకాడమీలో ప్రాగ్ చాంబర్ బాలె (The Prague Chamber Theatre) ఏర్పాటుచేశారు. జెకొస్లొవక నృత్య రీతులని భారత ప్రజలకు చేరువగా తెస్తోంది ఈ ప్రదర్శన; ఐసిసిఆర్ (ICCR) స్థాపితమయినదే, అన్యదేశాలకు మన నృత్య సంగీతాదులను పరిచయం చేస్తూ, వారి సాంస్కృతిక సౌరభం మనం తెలుసుకొనేందుకు! ప్రాగ్ చాంబర్ బాలె అనేక దేశాలలో ప్రదర్శనలిచ్చి మెప్పు, గుర్తింపూ పొందిన నాట్యకళా బృందం. ఇంటర్‌వెల్‌కి ముందు మూడు అయిటమ్స్ ఇంటర్‌వెల్ తర్వాత ఒక అయిటమూ చేశారు - ఏడుగురు యువతులూ, ఏడుగురు యువకులూ ఈ ప్రదర్శనలో పాల్గొన్నారు. కండరాలూ ఎముకలూ గల శరీరాలు కావవి; ఎలా వెబితే అలా వంగే రబ్బరు బొమ్మలు. నాలుగు నెంబర్లలోను 'హిరోషిమా' చాలా గొప్పగా, మానవాళికి ఒక గుణపాఠం మాదిరి ఉంది. హిరోషిమా నగరంపై అటంబాంబు జారవిడిచిన అమెరికన్ పైలట్ అంతరంగ మథనమే ఈ బాలె. ప్రశంసలతో అతనిని అమెరికా ప్రభుత్వం గౌరవిస్తోంది; కాని, హతులైన అమాయక ప్రజల ఆక్రోశం, కనిపించని కోరలవలె,

పీక్కుతినే వేళ్లవలె ఆ పైలట్ని భయవిహ్వాలుని గావిస్తాయి. అతి సుందరమైన తరుణీమణి, అంతరాత్మకి ప్రతిరూపంగా, అతనిలో పరివర్తన తేవడం, తన దుష్కృత్యానికి అతను పరితపించిపోయి పశ్చాత్తాపం జెందడం, ఈ నృత్య నాటికలోని ప్రధాన యితివృత్తం. రాతి గుండెని చిగురింపజేసే రామణీయకత కనిపిస్తుంది ఇందులో !

..... 18

"చదువుకొనే రోజుల్నుంచీ ఇద్దరం ఒకరికొకరం బాగా తెలిసినవారము. హాస్టల్ జ్ఞాపకాలు, హైకోర్టు జ్ఞాపకాలు, ఎదురెదురుగా ఇళ్లు, ఫామిలీ ఫ్రెండ్ షిప్ - ఈనాడు జస్టిస్ మోహన్ గురించి కొత్తగా నేను ఏం చెప్పేది ? ఏ గౌహాతీయో పంపించక, బెంగుళూరులో ఛీఫ్ జస్టిస్‌గా నియమించడం, నలభై నిముషాల దూరంలో ఆయన వుండటం, వీకెండ్స్‌కి కలుసుకోగల అవకాశం, నాకేకాదు, మీలో చాలా మందికి సంతోషం కలిగించే విషయం. మద్రాసులో మనం 'మిస్' అయేవ్యక్తి బెంగుళూరుకి ఒక యసెట్" - అన్నారు అధ్యక్షత వహించిన జస్టిస్ ఇస్మయిల్, సిటీజన్స్ కమిటీ, హొటల్ కాంచీలో, కర్నాటక హైకోర్టుకి ఛీఫ్ జస్టిస్‌గా నియమితులైన జస్టిస్ మోహన్ గౌరవార్థం ఏర్పరిచిన సమావేశంతో! మైలాపూరు అకాడమీ వీరరాఘవన్ ఆహూతులకు స్వాగతం తెలిపారు. "నేను జస్టిస్ మోహన్‌తో కలిసి వాదించాను; ప్రతిపక్షంగా వాదించాను ; ఆయన ముందు వాదించాను" అన్నారు సీనియర్ అడ్వకేట్ యన్పి రాఘవాచారి. నరసింహన్ సభా ప్రారంభం గావించగా, పాండుచ్చేరి వైస్ ఛాన్సలర్ వెంకట సుబ్రమనియమ్ తమిళంలో మాట్లాడి, ఛలోక్తులతో శ్రోతలను నవ్వించారు. మాజీ కేంద్రమంత్రి సుబ్రహ్మణ్యం, అడ్వకేట్ ఆర్ గాంధీ, లయన్ టిజె జార్జి, ఇండియన్ బాంక్ గోపాలకృష్ణ యిలా ఎందరెందరో ప్రముఖులు జస్టిస్ మోహన్ హాయిత్రీ, టెన్నిస్, న్యాయశాస్త్ర కౌశలం, సమాజ సేవ, కళాభిరుచి, సాంస్కృతిక చింతన, స్నేహశీలత మున్నగు విషయాల గురించి మాట్లాడారు - ఆయన సముచిత రీతిని సమాధానం చెప్పారు. జస్టిస్ మోహన్ ఒక మాగ్నెటిక్ పెర్సనాలిటీ. ఒకసారి పరిచయమైనవారు ఆయనలోని సహృదయతని సద్భావాన్ని, సచ్ఛీలతను మరువలేరు. ఇద్దరు ముగ్గురు వక్తలు సూచించినట్లు, బెంగుళూరు నుంచి ఆయన సుప్రీమ్ కోర్టు జడ్జిగా వెళ్లవచ్చు. గౌరవనీయులు జస్టిస్ మోహన్‌కు మా మనఃపూర్వక శుభాకాంక్షలు.

..... 19

రాజా - లక్ష్మి అవార్డు ఉత్సవం రాణీ సీతయ్ హాలులో సాయింత్రం అయిదున్నరకి మంజుభార్గవి పురందరదాస్ గణేశస్తుతితో ప్రారంభమయింది. ఆ తర్వాత రాగమాలికలో 'గోవర్ధన

గిరిధార. మూడవదైన ఖండగతిలోని శివాష్టకం, ప్రేక్షకులని రసవాహినిలో ముంచింది. మంజుభార్గవి నాట్యప్రతిభ గురించి ఈనాడు కొత్తగా చెప్పవలసిందేమీలేదు (నట్టువాంగమ్ : వెంపటి చిన సత్యం). .... కూచిపూడి ప్రదర్శనానంతరం సన్మాన కార్యక్రమం. ప్రధాన పురస్కార గ్రహీత : డా॥ బెజవాడ గోపాలరెడ్డి (రు. 25 వేలు నగదు - అమెరికా పర్యటనకు న్యూజెర్సీ నుంచి జ్యోతీరావు దంపతుల పిలుపు) ; సాహితీపురస్కారం : డా॥ తిరుమల రామచంద్ర (రు. 10 వేలు నగదు). పారిశ్రామికవేత్త డిసి కొఠారి (కొఠారీ అండ్ సన్స్), పారిశ్రామికవేత్త వియల్ దత్తు (కె సి పి) పురస్కార గ్రహీతలను అభినందించారు. ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు చంద్రశేఖరరావు, విద్యావేత్త జయ, అమెరికానుంచి వచ్చిన కిడాంబి రఘునాధన్ ప్రసంగించారు. రాజాలక్ష్మి దంపతులు గోపాలరెడ్డిగారికి పురస్కారం అందజేయగా, తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు నారాయణరెడ్డి, తిరుమల రామచంద్రకు పురస్కారం అందజేస్తూ, "వేదిక మీద ఆశీనులైన అందరిలో ఒక్క వియల్ దత్తు తప్ప మిగతా అందరూ డాక్టర్లే - వారినీ తొందరలోనే డాక్టరు చేస్తారు. మంచిని పెంచడమే కాదు, మంచిని పంచడం కూడా ప్రత్యక్షంగా చూస్తున్నాము" - అన్నారు. తెలుగు భాషా సమితి ఆంజనేయులు, కారెక్టర్ యాక్టర్

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు, మాఊళ్లో 'జగతి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా జేరమని! రెండు సంవత్సరాలకి అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI - Monthly, 2, Kutchery Road, P. B. 2922 - Madras-600 004

గుమ్మడి వెంకటేశ్వరరావు, అందరికీ అప్పుడైన పేకేటి శివరామ్ - ఈ ముగ్గురినీ రాజాలక్ష్మి ఫౌండేషన్, నేటి వేదికమీద సన్మానించింది. ప్రాకృత భాషావైభవం గురించి తిరుమల రామచంద్ర తన సమాధానంలో చెప్పగా, "ఒక్కసారి మినహా పదకొండేళ్లుగా ఈ అవార్డు ఫంక్షన్‌కి పౌరోహిత్యం వహిస్తున్న నన్ను యివ్వాళ పెళ్లికొడుకుని చేశారు ; ఈ పాతికవేలూ 'రవీంద్రుని విశ్వభారతి'కి సమర్పిస్తున్నాను" - అన్నారు గోపాల రెడ్డి. ప్రొఫెసరు ప్రసన్నకుమార్ కార్యక్రమ ప్రయోక్త ; కళారంజని కార్యదర్శి పాండురంగ వందన సమర్పణతో మూడున్నరగంటల ఉత్సవం ముగిసింది. తెలుగువారి ప్రతిష్ఠాత్మక పురస్కారం 'రాజాలక్ష్మి అవార్డ్' - దానికి సాటి మరొకటి లేదు ఆరున్నొక్క కోట్ల ఆంధ్రప్రదేశ్‌లో !

. . . . . 27

ఛార్లెస్ డిక్సెన్ నవల 'గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్' ('Great Expectations') చదివినవారికి అందులోని సంభాషణా చాతుర్యమూ నాటకీయత గురించి చెప్పవలసినపని లేదు. ఆ రెండిటినీ గుచ్చెత్తి, వాటికి నృత్యమూ నటనా జతచేసి, ఎడింబరో నగరంలోని 'ట్రావర్స్' అనే రంగస్థలవేదిక (The Traverse Theatre) ఒక వినూత్న కళాప్రయోగం రూపొందించి, ప్రపంచంలోని, పలునగరాలలో ప్రదర్శించి, రసజ్ఞుల మన్నన పొందింది. ఇది నాటకమూ కాదు, నాట్యప్రదర్శనా కాదు. ఒక వయసున మదిలో హత్తుకుపోయిన పాత్రలకు నృత్యగానాలతో రూపకల్పన, రంగస్థలానికి అనువుగా ఈ నవలని తీర్చిదిద్దడంలో, వేర్వేరు పాత్రధారులు తమ పోర్షనులు, విసుగనేది లేకుండా చదివి, రెండు అంకాలలో ఇది తయారవడానికి ఎటువంటి సామూహిక కృషి సల్పినదీ చెబుతాడు స్క్రిప్ట్ రచయిత జాన్ క్లిఫ్ఫర్డ్. (John Clifford) ఈ ప్రదర్శన వేర్వేరు కళావిభాగాలు సమ్మిశ్రమం - అంటాడు డైరక్టర్ ఐయాన్‌బ్రవున్ (Ian Brown) ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్ (Indian Council for Cultural Relations) వారి ఆహ్వానం పై ఈ ట్రావర్స్ థియేటరువారు, మన నాలుగు ప్రధాన నగరాలలోను ఒకొక్క చోట రెండేసి రోజుల చొప్పున (ఢిల్లీలో నవంబరు 20, 21 ; కలకత్తాలో 23, 24; మద్రాసులో నవంబరు 27, 28 ; బొంబయిలో నవంబరు 30, డిసెంబరు 01) ప్రదర్శనలిస్తున్నారు. ప్రదర్శన కాలం రెండున్నర గంటలు .... మొదటి అంకంలోని పిప్ చిన్నవాడు ; రెండవ అంకానికి పెద్దవాడవుతాడు. అంచేత, ఆ పాత్ర ఒక్కటి మాత్రం యిద్దరు వేస్తారు .... జైలు నుంచి తప్పించుకున్న నేరస్థుడు మాగ్‌విచ్. పిప్ అతని గొలుసులు వూడదీసి బంధవిముక్తిని గావిస్తాడు. కాని, పోలీసులు మళ్లీపట్టుకుంటారు - జైలుకి పంపిస్తారు .... హావ్‌షామ్ అనే వృద్ధకన్య, తన దత్తపుత్రిక ఎస్టిలాకు, పురుషుని గుండె గునపంతో పొడిచే విద్య నేర్పు

తుంది. ఆ విద్యాభ్యాసక్రమంలో ఎస్టిలా అమాయకుడైనా పిప్‌ని గుండెకోతకు గురిచేయగా, అక్కా బావలు అతనిని ఆదుకుంటారు; ఆ అక్కని ఎవరో హత్యచేయగా, బిడ్డీ ఆదుకుంటుంది. ఇంతలో లండన్ నుంచి లాయర్ జాగర్స్ వచ్చి, పిప్‌కి చెందేటట్లుగా ఎవరో చాలా ధనం వ్రాశారనీ, ఆ పెద్ద మొత్తాన్ని పట్నం వచ్చి, తన ద్వారా తీసుకోమనీ చెప్పడంతో మొదటి అంకం పూర్తవుతుంది .... సిరితోబాటు పెద్దమనిషి తరహా రావాలి గనక, పెద్దమనుషులు (జెంటిల్‌మెన్) ఎలా నడుచుకోవాలో హెర్బర్ వద్ద పాఠాలు నేర్చుకుంటాడు పిప్. ధనవంతుడైన పిప్, హేవ్‌షామ్ వద్దకు వచ్చి, ఎస్టిలా ప్రేమను అర్థిస్తాడు. అమ్మ యిష్టప్రకారం తను మరొకరెవరినో చేసుకుంటాననీ, ప్రేమాగీమా పట్ల తనకు నమ్మకంలేదనీ చెబుతుంది ఎస్టిలా. హేవ్‌షామ్ మంటల్లో చనిపోతుంది; ఇంత సంపదకు వారసుడైన పిప్ అప్పులపాలై ఆరోగ్యం చెడగొట్టుకోగా, బావగారు మళ్లీ చేరదీస్తాడు .... మరొకసారి తప్పించుకున్న మాగ్‌విచ్‌కి మరణదండన పడుతుంది .... పిప్‌కి రహస్యంగా ధనం సంక్రమింపజేసినది మాగ్‌విచ్; వృద్ధకన్య దత్తపుత్రికగా పెరిగిన ఎస్టిలా ఈ మాగ్‌విచ్ కూతురు. అసలు రహస్యం వెల్లడయాక, కల్మషరహితులైన ఆ యువతీ యువకుల హృదయాలను వసంత సమీరం



వెరువకి తెస్తుంది.... ఈ వినూత్న కళా ప్రక్రియ మ్యూజిక్ అకాడమీలోని ప్రేక్షకులని రసానంద లహరిలో మునకలు వేయించింది. జాన్‌క్లిఫర్డ్‌ది అభినందనీయమగు ప్రయత్నం.

1989 డిసెంబరు 01

కస్తూరి రంగా ఆడిటోరియమ్‌లో (మ్యూజిక్ అకాడమీ) సాహిత్య అకాడమీ వారి 'రచయితను కలుసుకోండి' ప్రోగ్రామ్ (Meet the Author - Sahitya Akademi) ప్రఖ్యాత తమిళరచయిత జయకాంతన్, మనని మనం తెలుసుకొనేందుకు, బయట ప్రపంచం తెలుసుకోవలిసిన ఆవశ్యకత ఎంత ఉన్నదో గంభీరంగా, నిదానంగా, భావస్ఫోరకంగా చెప్పారు .... రోమన్‌రోలా (నోబెల్ లారియట్) 1927 లో గాంధీజీ జీవితకధగా 'మహాత్మా' అనే పుస్తకం వ్రాశాడని నేటి తెలుగు రచయితలలో చాలా మందికి తెలియదు ; నాకు తెలిసినంతలో దానిని తెలుగులోకి ఎవరూ అనువదించినట్లు కూడా లేదు. అటువంటి పుస్తకాన్ని తమిళ పాఠకులకు సమర్పించిన ఘనత జయకాంతన్‌ది. ఇంగ్లీషుభాష, చరిత్ర జవహర్‌లాల్ నెహ్రూ 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' నుంచి నేర్చుకున్నాను - అంటారు విశుద్ధ మానవతావాది అయిన జయకాంతన్. పుదుమైపిత్తన్, అలగిరిస్వామి వల్ల ప్రభావితుడైన జయకాంతన్, తమిళ ఫిక్షన్‌కి (కల్పనా సాహిత్యం) ఖండాంతరఖ్యాతి తెచ్చారు. పన్నెండవ ఏట ఇల్లువొదిలిన బాలుడు (కడ్డలూరు నుంచి) మద్రాసువచ్చి, కమ్యూనిస్టుపార్టీ వారి ప్రింటింగ్‌ప్రెస్‌లో కంపోజిటర్‌గా చేరాడు - ప్రూఫ్ రీడరయాడు - పోస్టర్లు అతికించాడు - పార్టీవారి ప్రదర్శనలలో, ఊరేగింపులలో పాల్గొన్నాడు. జీవనానందమ్, కుమార మంగళమ్, బాల దండాయుధమ్ వంటి నాయకుల ముఖతా ఎన్నో నేర్చుకున్నాడు. 1954 లో అంటే తన 20వ ఏట తనకధ తనే కంపోజ్ చేసుకున్నాడు .... 'పగటి పాసింజరు'లో ప్రయాణం చేస్తూ మరణించిన ఒక బ్రాహ్మణ వితంతువు, తన శిశువుని ఒకవృద్ధుని చేతుల్లో పెట్టి, తనకు శ్రాద్ధకర్మ చేయమని కోరుతుంది. అతను చేస్తాడు. ఆ వృద్ధుడు హరిజనుడవడంతో ఈ కథ ఒక దుమారాన్ని లేపింది. ('పగటి పాసింజరు'). తోటలో ఫకీరు, నేను బతికేవున్నాను. చీకటికోసం వెతుకులాట, ఏం చేయాలో చెప్పండి, అగ్ని ప్రవేశం మొదలగు సంచలనాత్మక రచనల తర్వాత 'సెల నేరంగళ్, సెల మనిదర్‌గళ్' ('కొన్ని సమయాలు - కొందరు మనుషులు' - మాలతీ చందూర్ తెలుగు చేశారు - నేషనల్ బుక్‌ట్రస్ట్ ప్రచురణ), కరుణ ఉల్లమ్, జయ జయ శంకరా, సుందర కాండమ్ - ఇలా ఏభైకి పైగా ఉన్నాయి. 1964 లో కమ్యూనిస్టు పార్టీ నుంచి బయటకివచ్చి ఫిలిమ్‌ఫీల్డ్ ప్రవేశించారు జయకాంతన్. 'ఉన్నైయే పోల్ వరువాన్' చిత్రం ప్రెసిడెంట్ అవార్డు పొందింది. 1972 లో సాహిత్య అకాడమీ అవార్డ్ ; 1977 సార్వత్రిక

ఎన్నికలలో నిలబడి ఓడిపోయారు ; 1978లో సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డ్; 1980, 1983, 1984 - మూడు తడవలు సోవియట్ యూనియన్ పర్యటన. 1988లో రాజరాజ చోళన్ బహుమతి (లక్ష రూపాయలు నగదు) .... 'వెనకరాసిన వాటి గురించి మాట్లాడటమే తప్ప యిప్పుడు రాస్తున్నదేమీ లేదు. వ్రాయాలని అని పించడమూ లేదు' - అన్నారు జయ కాంతన్. ఆయన రచనలు భారతీయ భాషలూ ఇంగ్లీషులోనే గాక, రష్యన్, జర్మన్, జపనీస్ భాషలలో కూడా వెలువడ్డాయి.... సాహిత్య అకాడమీ ప్రాంతీయ కార్యదర్శి కృష్ణమూర్తి సమావేశ ప్రారంభాన, ఆహూతులకు స్వాగతం చెబుతూ 'మీట్ ది ఆదర్' కార్యక్రమాన్ని వివిధ కేంద్రాలలో ఎలా నిర్వహిస్తున్నదీ తెలిపారు .... చెన్న పురి ఆంధ్ర మహాసభ కౌతా సూర్య నారాయణరావు హాలులో (ప్రెసిడెంట్: బివియస్ స్పెస్ మణి ; ఛెయిర్మాన్ : జెవి సోమయాజులు), కోట సచ్చిదానంద శాస్త్రి భాగవతార్ చే (గుంటూరు) శ్రీమద్ మహాభారత హరికథా గాన ప్రవచన శ్రవణ యజ్ఞం - సంగీత కళానిధి బాలమురళీ కృష్ణ ఈ హరి కథా కాలక్షేపానికి ప్రారంభకులు. నలభై మూడు ఘట్టాలలో నవరస భరితంగా గానం చేస్తూ శ్రవణ యజ్ఞం నిర్వహిస్తారు ఈ భాగవతార్ .... హోరున వర్షం పడుతున్నా, మధ్యా

హ్నాం మణిగారు చెప్పారు కదా అని వెళ్లి, ఒక గంటసేపు కూచుని వచ్చాము. భగవద్గీత, విష్ణు సహస్రనామపారాయణ ప్రతిరోజూ జరుగుతుందని పంచి పెట్టిన కరపత్రంలో ఉంది.

. . . . . 03

మిత్రులు రామేశానికి అరవై వసంతాలు నిండిన సందర్భంగా, ఈ మధ్యాహ్నం వారింట్లో లంచ్. 'మీ డ్రయివర్‌కి సెలవివ్వండి - మేము వచ్చి తీసుకువెళ్తాం. పొద్దుటా, సాయింత్రం కూడా - హాయిగా కబుర్లు చెప్పు కుంటూ వెళ్లవచ్చు' - అన్నారు రాధా శివస్వామి. పదకొండు గంటలకు బయలుదేరి హేమా రామేశం దంపతుల యింటికి వెళ్లాం. పీటలమీద కూచోవడం, పూజ, సత్యనారాయణ వ్రతం యిత్యాదులు అయిపోయాయి. సరిగ్గా భోజనం వేళకి వెళ్లాం. పట్టు బట్టలలో వున్న రామేశాన్ని పలకరించి, మెనీహాపీరిటర్న్స్ చెప్పి, కాసేపు క్రికెట్ (టివిలో) చూశామో లేదో భోజనాలకి పిలుపు. సుందరీ — హనుమంతరావు, కామేశ్వరీ - నరసింహం, విక్రమ్, శ్యామల - యిలా అందరూ ఇరవైఏళ్లుగా బాగా తెలిసినవారే! భోజనాలై బయలుదేరుతున్నప్పుడు, 'ఏడు వేల రూపాయిల ఫ్లాటు చూదురు గాని' అని రామదాసుగారింటికి పట్టుకెళ్లారు రాధ. రామదాసు దంపతులని హాడోస్ రోడ్‌లో దించి, ఏడవ అంతస్థులోని (ఆ భవంతి తొమ్మిది అంతస్థులు) వారి ఏడవ నెంబరు ఫ్లాటులోకి వెళ్లాం.

చాలా బావుంది - ఫ్లాట్ ఎంతో విశాలంగా ఉంది! కాసేపు ఎన్నికల కబుర్లు, రాజకీయాలు, టీ తీసుకోవడం అయాక, మమ్మల్ని లిఫ్ట్‌లో ఎక్కించబోతూ, 'మేము నెలకి ఏడువేలు యిస్తున్నాం - అటువైపు నున్న ఆ డీలక్స్ ఫ్లాట్ పదివేలు - ఇంతకంటె చాలా సౌకర్యంగా ఉంటుంది' - అన్నారు మిసెస్ రామదాసు .... శివస్వామి దంపతులు ఎనిమిది గంటలకు వచ్చి సవేరాకు తీసుకువెళ్లారు. పొద్దుటంతా సంప్రదాయ ప్రకారం ; ఇప్పుడిదంతా అధునాతనం. హాట్ అండ్ సాఫ్ట్ డ్రింక్సూ, కొత్త ముఖాలు, కొత్త పరిచయాలు, ఒకచోట నిలబడకుండా గిరగిర తిరగడం, గ్లాసు చేతబుచ్చుకు కనీసం గంటన్నర రెండు గంటలసేపు కబుర్లు, నిర్విచారమైన నవ్వులు, వి పి సింగ్ బ్రాడ్‌కాస్ట్, ఎలక్షనుల పోస్ట్‌మార్టమ్, ప్రయివేట్ అండ్ పబ్లిక్ సెక్టార్, పెరిగే ధరలు, ఆదాయం పన్ను, దేశ భవిష్యత్తు, రాష్ట్ర పరిస్థితి - ఒకటేమిటి, సమస్తం! ఎవరికి తోచినది వారు చెప్పనదివారు చెప్పడం, ఎవరి దృక్పథం వారు వెల్లడించడం ! అందరిలోకీ బీదవారం మేమేనేమో ననిపించింది. అయితే, వారిది ఆర్థిక సంపద, మాది సాహితీసంపద అని మళ్లీ మనసుకిధైర్యం చెప్పుకోవడం! డిన్నరూ అయిస్క్రీమూ బీడా యిత్యాదులు పూర్తి అయి, ఒక్కరొక్కరి దగ్గరే వీడ్కోలు తీసుకుంటూ, బయటపడేసరికి పన్నెండున్నర. కారు ఎక్కబోతూ పుల్లయ్యగారి

అమ్మాయిలతో మరొక పదినిముషాలు : ఇల్లు చేరేసరికి యించుమించు ఒంటిగంటయింది. గీతాసూక్తులతో సంభాషణను పరిమళింపజేసే రామేశానికి సర్వశుభములూ చేకూరాలని మా మనఃపూర్వక ఆకాంక్ష. హేమా రామేశాల అన్యోన్యత ఆదర్శప్రాయం.

. . . . . 04

"నా పార్లమెంటరీ నియోజకవర్గంలో ఏడు అసెంబ్లీ స్థానాలు వున్నాయి. అందులో నాలుగు కాంగ్రెస్ పార్టీ గెలుచుకోగా, మూడు స్థానాలు 'తెలుగు దేశానివి' అయాయి. ఏ ప్రజాహిత కార్యం సక్రమంగా నిర్వహించాలన్నా, వీరందరి సహకారం కావాలి. ఎన్నికల వేళ పోటీ తప్ప, ఆ తర్వాత అందరి లక్ష్యమూ సామూహిక శ్రేయస్సే - అవలంబించే పద్ధతులలో తేడాలు వుండవచ్చు .... అవకాశం వచ్చినప్పుడు, సినిమా పరిశ్రమ ఎదుర్కొనే సమస్యలను తప్పకుండా లోక్‌సభ వారి దృష్టికి తెస్తాను - దేనికైనా సమయ సందర్భాలు వొనగూడాలి కద! .... రాజకీయాలలో ప్రవేశించిన కారణంగా, నేను యిప్పుడు చేస్తున్న ఫిలిమ్స్‌లో సగం మాత్రమే చేయగలుగుతాను - అంటే, సంవత్సరానికి అయిదారు చిత్రాలు మాత్రమే ; మిగతా టైము నా నియోజకవర్గ సమస్యలకు వినియోగిస్తాను," అన్నారు 'కృష్ణ - యమ్‌పి'. విజయనిర్మల మేడ మీద ఏర్పరిచిన గోష్టిలో పత్రికా మిత్రులతో తనసంతోషం పంచుకొనే సమావేశమిది. 'విపి సింగ్ ప్రభుత్వంపై మీ అభిప్రాయం 'మిటి ?' అని ఒకరు అడిగిన ప్రశ్నకు, "మెజారిటీ పార్టీ కాంగ్రెస్ మంత్రివర్గ నిర్మాణం నిరాకరించాక, రెండవదైన జనతాదళ్ అందుకు పూనుకుంది. 300 గల జనతా

1977లో చేయలేనిది, అందులో సగం మంది కూడా లేని ఈ మైనారిటీ గవర్నమెంటు ఎంతదాకా లాక్కు రాగలదో వేచిచూడాలి. ఎవరు పాలించినా ప్రజా సమస్యలు ముఖ్యం. కేంద్రంలోను, రాష్ట్రాలలోను ప్రజలు మార్పుని కోరారు - ఆ మార్పు సాధించారు. పార్టీల గెలుపూ ఓటమీ కాదు. ప్రజాస్వామికం ఆ ఏటికా ఏడు పటిష్టవంత మవడమే మన ప్రగతికి సూచకం" - అన్నారు గ్లామరస్ హీరో కృష్ణ, రాజకీయ విజ్ఞతతో! తన 48వ జన్మదినం కాంగ్రెస్ పాలనలో ఉన్న ఆంధ్రప్రదేశ్‌లో జరుపుకుంటానని మద్రాసు మ్యూజిక్ అకాడమీలో 1989 మే 31వ తేదీన, సాహసమే ఊపిరిగా ఆత్మవిశ్వాసంతో చెప్పిన కృష్ణ పలుకులు నిజమయాయి. కాగడా శర్మ అయన నెప్పుడూ మహా రాతకుడు అంటూంటారు. జాతకాల మాట ఎటున్నా, ప్రజలు తనపై నమ్మకంతో వొప్పగించిన బాధ్యతను కృష్ణ సక్రమంగా నిర్వహించ గలరనీ, ఆ బాధ్యతా నిర్వహణలో విజయనిర్మల, అయన సోదరులు, ఆప్తులు అండగా నిలవగలరనీ, ఈ ప్రజారధ సారధి అన్నిటా విజయుడవాలనీ అభిలషిస్తున్నాము. .... ప్రఖ్యాత దర్శక నిర్మాత యల్వి ప్రసాద్ మనుమరాలు సౌ॥ రాధికకు (రమేష్ దంపతుల కుమార్తె) డాక్టర్ నల్ల కృష్ణన్ దంపతుల కుమారుడు చి॥ రవికి ఈ ఉదయం విజయా శేష్‌మహల్‌లో వివాహం జరిగింది. పొద్దుట ముహూర్తానికి, సాయింత్రం రిసెప్షన్‌కి చలనచిత్ర రంగంలోని ప్రముఖు లనేకులు విచ్చేసి నూతన వధూవరులను ఆశీర్వదించారు. నవ దంపతులకు మా శుభాకాంక్షలు.

. . . . . 07

"స్లాబ్ సిస్టమ్ వల్ల 97 శాతం నష్ట పోయి, పరిశ్రమలో అనేకులు నిరుద్యోగులు లవుతూ వుండగా, మూడు శాతం మాత్రమే బాగుపడుతున్నారు – అదికూడా అయిదుగురు హీరోలు, పదిమంది పెద్ద ప్రొడ్యూసర్లూను - చిన్నవారికి స్థానం లేకుండాపోతోంది. స్లాబ్ సిస్టమ్‌లో ఆర్థిక న్యాయం (Economic Justice) ఆ వ గిం జ అయినా లేదు. భాగ్యవంతులని మరీ భాగ్యవంతులుగా చేస్తోంది. వెనకట్లో సంవత్సరానికి పదిలక్షలు వినోదపు పన్ను కట్టేవారు. ఇప్పుడు ఆరు లక్షలతో సరిపెట్టగలుగుతున్నారంటే, ఆ నష్టం ప్రభుత్వానిది కదా ?" - అని ప్రశ్నించారు ప్రభాకరరెడ్డి, తెలుగు ప్రొడ్యూసర్స్ కౌన్సిల్ ఏర్పరచిన పత్రికా గోష్టిలో ! ఈ స్లాబ్ సిస్టమ్ రద్దుచేయమని, రాష్ట్రంలోని నూతన ప్రభుత్వాన్ని అర్థింపనున్నారు. విజయ చందర్, డివియస్ రాజు, సారథి, లక్ష్మీ దీపక్ మున్నగువారు ఈ సమావేశంలో పాల్గొన్నారు.... 'ప్రియతమా పిలువకుమా, ప్రియతమా నను పిలువకుమా, వేళగాని వేళ ఈ కోరికేలరా' (రచన : ముళ్ళపూడి శాస్త్రి.... గాత్రం : సుశీల) అని రంభ (పారిజాత), రాంబాబుని (రాజేంద్రప్రసాద్) ఉద్దేశించి, ఇం ద్ర స భ లో నాట్యమయూరిలా హొయలు జిమ్ముతూ పాడుతుంది - లక్ష్మీ దుర్గావారి (సమర్పణ : సత్యనారాయణ ప్రసాద్ - దర్శకత్వం : రేలంగి నరసింహారావు) 'రంభ - రాంబాబు' చిత్రంలో ! కొత్త శ్రీదేవి, రాజేంద్రప్రసాద్‌పై చిత్రీకరించిన 'బాలామణి రావే - భామామణి రావే' (రచన : ఆత్రేయ - గాత్రం : మనో) కాస్త అల్లరిపాట - 'మాయాబజార్' ని గుర్తుకి తెస్తూవుంటుంది. ఇవ్వాళ విజయకృష్ణా థియేటర్‌లో చూపించిన మూడవ పాట ; 'కూర కూర కూర గోంగూర - కాయ కాయ కాయ అవకాయ' (గేయం : ఆత్రేయ.... గాత్రం : బాలు, సుశీల) రాజేంద్ర ప్రసాద్, పారిజాతలపై చిత్రీకరించారు. పైన చెప్పిన వారుగాక, చంద్రమోహన్ సింహపురి సుధాకర్, సాక్షి రంగారావు, వేలు, త్యాగరాజు, శ్రీలక్ష్మి, కాకినాడ శ్యామల మున్నగువారున్నారు. ప్రధాన ఆకర్షణ : దాసరి నారాయణరావు. మాటలు - పద్యాలు : పాటి బండ్ల ఆనందరావు, సంగీతం : మాధవపెద్ది సురేష్.... ఈ పిక్చర్ సక్సెస్ అవడంలో ఎటువంటి సందేహమూ లేదనీ, అరవై రోజుల కృషి సత్ఫలితాన్ని యిచ్చిందనీ, అన్నారు దర్శకులు రేలంగి నరసింహారావు.

—యన్నార్ చందూర్



వెనకటి తప్పులు మళ్లీ చేయటం గాక, కొత్త తప్పులు వేయటాన్ని 'అనుభవం' అంటారు. —ఈనోస్

ఈ స్కూలు పాఠాలు నా అలుస చదువుని చెడగొట్టలేక పోయాయి.

—మార్క్‌ట్వేన్



**JAGATI Telugu Monthly - Vol. 35 - No 403 - Fed 90**

**Edited, Printed and Published by N. R. Chendur at**

**MANASA PRESS, 2 Kutchery Road, Madras - 600 004**

**Phone: 7 6 6 9 7**